# రెడ్ ఆర్మీ

50 ప్రశ్నలూ - సమాధానాలు.





రెడ్ ఆర్మీ నాయకుడు : కామ్రేడ్ స్టాలిన్.

్వసాహిత్యమాల 27.

# రెడ్ ఆర్మీ.

## 50 ప్రశ్నలూ - సమాధానాలు.

ఖపర్ మాంపేగ్.



అనువాదం:

మహీధర జగన్మోహన్‌రావు.

నవంబరు 1942.



విశ్వసాహిత్యమాల,
ముంగండ.
(వయా) అంబాజీపేట, తూ. గోదావరి.

1941 ఆగస్టులో వ్రాయబడింది.

1942 జూలైలో యిండియాలో ప్రకటితమైంది.

రాజమండ్రి:

శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాలయందు

ముద్రితము—1942.

వెల నాలుగు అణాలు.

# రె డ్ ఆ ర్మీ.

## 1. 'రెడ్ ఆర్మీ' అంటే ఏమిటి ?

"ఎరుపు" రంగు కూలీలకూ, వాళ్ళ జెండాకూ అనుశ్రుతంగా వస్తూంది. ఈ ఎరుపే సోషలిజానికికూడా చిహ్నం. 1917 నవంబరులో, రష్యా విప్లవదినాల్లో జారుసైన్యాలు సప్లయిలేక, శిక్షణలేకా విచ్ఛిన్నమై పోయేయి. ట్రేడ్ యూనియనులు, ఫ్యాక్టరీసంఘాలు మొదలైనవి కార్మికు లను సాయుధులను చేసుకుని చిన్న చిన్న పటాలాలుగా యేర్పరచేయి. పూర్వం సైనికులుగానూ, నావికులుగానూ వున్నవాళ్ళుకూడా వీటిల్లో చేరేరు. ఈ చిన్నపటాలాలనే "రెడ్_గార్డ్సు" అని పిలిచేవారు. రైతులు, కూలీలు, సైనికులు తమ ప్రతినిధులనుచేర్చి స్థాపించిన ప్రభుత్వము అంటే సోవియట్ ప్రభుత్వమువచ్చేక 1918 జనవరిలో యీ రెడ్ గార్డులు అన్నీ కలిపివేయబడినాయి. అప్పటికి వాటిలో 50 లేక 60 వేలమందిమాత్రం వుండేవారు. ఇదే రెడ్ ఆర్మీప్రారంభం. ధనిక ప్రభుత్వాలు అన్నీ కలిసి సోవి యట్లను నాశనంచేయపూనుకున్నాయి. ఆ దినాల్లో అంతవరకు వాలంటు రీగాచేరిన సైన్యాలు చాలక రష్యాఅంతట కార్మికుల్ని విరివిగా సైన్యాల్లో చేర్చేరు. 1917 మొదలు 1921 వరకూ జరిగిన అంతర్యుద్ధాల్లో, అన్నిరం గాల్లోనూ పోరాడి, యీ సోవియటుసైనికులు విప్లవద్రోహుల్ని, విదేశీ సామ్రాజ్యవాదుల్ని ఓడించగల్గేరు. అటువంటిసాంప్రదాయాల్లో తయారై పెంపొందినదే నేటి రెడ్ ఆర్మీ.

## 2. ఎర్రసైన్యాల్లో యేయేశాఖ లున్నాయి ?

ఎర్రసైన్యంవుంది; దానికి అనుబంధించే రెడ్ విమానదళంవుంది. బ్రిటన్‌లోనికివలె సోవియట్ విమానదళం, ప్రత్యేకమంత్రివర్గం చేతుల్లో వుండదు. ఎర్రనావికాదళం – దానికి సంబంధించే ప్రత్యేకవిమానదళమూ వుంది. ఇదిగాక 'ఫ్రాంటేరుగార్డ్సు' (సరిహద్దు రక్షణదళాలు) కూడా వున్నాయి. వీటికికూడా అన్నివిధాలైన ఆధునిక ఆయుధాలూవున్నాయి. కాని యీదళాలు "రెడ్ ఆర్మీ"తో ప్రత్యక్షసంబంధం గలవికాదు. 'శాంతి భద్రత' లను కాపాడే మంత్రివర్గంయొక్క పరిపాలనక్రిందనే యీ సరిహద్దురక్షణదళాలు వుంటాయి.

## 3. రెడ్ ఆర్మీని ఎవరు నడిపిస్తారు ?

'మిలిటరీ డిఫెన్సుకౌన్సిలు' సర్వాధిపత్యం కలిగివుంటుంది. దానికి ప్రెసిడెంటుకామ్రేడ్ స్టాలిన్. సోవియటుయూనియన్‌కు ప్రధానమంత్రి కూడా కామ్రేడ్ స్టాలినే. అతనివయస్సు 68. ఇతడొక చెప్పులుకుట్టువాని కొడుకు. మాస్కోరంగములో ప్రధానసైన్యాధికారి జనరల్ జి. ఝుకోవ్ ఇతని వయస్సు 48. జపాన్ సైన్యాలతో మంగోలియా సరిహద్దుపోరాటంలో యితడు ప్రసిద్ధివహించేడు. 1940 లో బెస్సరేబియాను స్వాధీనంచేసుకొన్న సోవియటుసైన్యాలను నడిపించిన దితడే. దక్షిణరంగంలో మార్షల్ టిమో షెంకో నాయకుడు. ఇతనివయస్సు 47. యుద్ధం మొదటిరోజుల్లో యితడు మాస్కోరంగంలో నాయకత్వం వహించేడు. బెస్సరేబియాలోని ఒక పేదరైతు. ఇతడితండ్రి జారుసైన్యాల్లో తనయిరవయ్యోయేటచేరి 1914 లో పశ్చిమరంగంలో పోరాడేడు. టిమోషెంకో రష్యాలోని అంతర్యుద్ధంలో విప్లవపక్షాన పోరాడేడు. 1919 లో బోల్షివిక్ పార్టీలోచేరేడు. తర్వాత యితరదేశాలకుపోయి అచ్చటిసైన్యవిషయాలు పరిశీలించివచ్చేడు.

పశ్చిమబైలో - రష్యా, పశ్చిమయుక్రెయన్‌లను 1939 లో సోవియటు సైన్యాలు ఆక్రమించినపుడు వాటినీతడే నడిపేడు.

వెనకవుండి బ్రహ్మాండమైన సైన్యాలకు తరిఫీదు యిస్తూంటారు. మార్షల్ క్లిమ్ వొరోషిలోవ్, మార్షల్ సెమ్యాన్ మైఖేలోవిచ్ బుడెన్నీ వొరోషిలోవ్ వయస్సు 60; బుడెన్నీ వయస్సు 58. 1917లో వొరోషిలోవ్ "లుగాన్స్క్" (ప్రస్తుతం వొరోషిలోవ్‌గ్రాడ్) లోని రైల్వేయింజన్ వర్కు‌ల్లో పనిచేస్తూండేవాడు. ఆ కర్మాగారములో మొదటిసమ్మెను యితడే, తన 18వ యేటనే ఆర్గనైజుచేసి నడిపించేడు. అంతర్యుద్ధదినాల్లో యితడు స్థానికంగా అశ్వదళాన్ని తయారుచేసేడు. జారిట్సిన్ రక్షణకు స్టాలిన్‌తో కలిసి ఆర్గనైజుచేసేడు.

మార్షల్ బుడెన్నీ 1917 లో అశ్వికదళంలో సార్జంటుగా వుండే వాడు. ఇతడు కోసక్కుగ్రామమైన 'ప్లటోవ్‌స్కయా'లో జన్మించేడు. అంతర్యుద్ధదినాల్లో తనగ్రామాన్ని ఆక్రమించిన "విద్రోహుల"ను తరిమివేయ డానికి రహస్యంగా ఒక మిలిటరీదళాన్ని ఆర్గనైజు చేసేడు. తరువాత యితడు సోవియటుఅశ్వికదళనాయకులలో ప్రసిద్ధివహించేడు. 1919 లో యితడు చరిత్రాత్మకమైన ఒకదాడిని నడిపేడు. జారిట్సిన్‌రాష్ట్రాన్ని విడి పించడానికి విద్రోహులగు కోసక్‌బలాల వెనకభాగంలోకి తన అశ్విక దళాన్ని 250 మైళ్ళు హుటాహుటీగా నడిపి, మానవాతీతమైనకార్యాన్ని సాధించేడు.

జనరలుస్టాఫులో ముఖ్యుడు జనరలు షపోష్నికోవ్.

నౌకాదళనాయకుడు అడ్మిరల్‌నికోలాయ్‌కుజ్‌నెట్‌సోవ్. ఇతడు నౌకాదళట్రెయినింగ్‌కాలేజీని నడుపుతున్నాడు. ఆధునికములైన పెద్ద నౌకల కమేండు యితనిచేతుల్లోనేవుంది విమానదళానికి లెఫ్టినెంటుజనరలు జాకాబ్‌స్మష్కేవిచ్ నాయకుడు. ఇతడు మంగోలియా యుద్ధంలోనూ,

ఇతరయుద్ధాల్లోనూకూడా పాల్గొని "సోవియట్ వీరు"డని బిరుదాన్ని పొందెను.

## 4. రెడ్ ఆర్మీలోకి యెల్లా చేర్చుకుంటారు?

19 సంవత్సరములువచ్చిన బాలురందరూ సైన్యంలో చేరితీరాలి. ఈ సైనికతరఫీదు రెండుసంవత్సరాలుంటుంది. అనారోగ్యంవల్లనూ, ఇంకా విద్యాభ్యాసంపూర్తికాకపోతేనూ, ఏకపుత్రవిషయంలోను, కుటుంబానికంతకూ ఒక్కడే పోషకుడైతేనూ, పరిశ్రమల్లో టెక్నికల్ ట్రైనింగుపొందుతుంటెనూ మినహాయింపు యివ్వబడుతుంది. 19 సంవత్సరాలు దాటినయువకుల్లో సాధారణంగా 60% లేదా 70% మాత్రమే ప్రతిసంవత్సరం మిలిటరీ తరఫీదుపొంది సైన్యంలో పనిచేస్తున్నారు. వాళ్ళసంఖ్య యేటేటా 15 లక్షలకుమించివుంటూంది.

## 5. మిలిటరీలో చేరడానికి ఆధ్యాత్మికంగా అభ్యంతరాలుంటే మన్నిస్తారా ?

ప్రస్తుతంలేదు. ఇదివరలో మతకారణాలవల్ల సైనికులుగాచేర నభ్యంతరాలున్నవాళ్లుండేవారు. అట్టిదరఖాస్తులు 1935, 1936 ల్లో ఒక్కటీ రాకపోయినందున 1937 లో యీ మినహాయింపు తొలగించబడింది. సోవియటుపౌరులెవ్వరూ అట్టిఅభ్యంతరాలమరుగున తమవిధిని ఉల్లంఘించుట లేదు.

## 6. పటాలాల్లో స్త్రీలు పనిచేస్తున్నారా ?

స్త్రీలకు నిర్బంధసైనికశిక్షణలేదుగాని తమంతటదామై సైన్యాల్లో చేరేవాళ్ళు చాలమందివున్నారు. స్త్రీలు ఆశ్వికదళాల్లోగాని, ప్రస్తుతం ఫిరంగిదళాల్లోగాని పనిచేయ నియమింపబడరు. చాలమంది టెక్నికల్ సర్వీసులోగాని, ఆడ్మినిస్ట్రేటివుసర్వీసులోగాని పనిచేస్తూంటారు. టాంకు

లను సంసిద్ధతలోనుంచుటు, ట్రాన్సుపోర్టు, కెమికల్ సర్వీసులు, వైద్యసహాయం మొదలైనపనులన్నిట్లోనూ ముఖ్యంగా స్త్రీలే పనిచేస్తుంటారు. ఫిన్లాండుయుద్ధంలో ఒకఫిరంగిదళం చుట్టుముటబడినప్పుడు స్త్రీడాక్టర్లూ, నర్సులూ యెంతధైర్యసాహసాలతో, నేర్పుతో, ఓర్పుతో పనిచేసేరో విదేశపత్రికావిలేఖరులు వ్రాసివున్నారు. (జి్రఫికార్సు "రెడ్ఆర్మీదాడి" అనేగ్రంథమును చూడండి.)

విమానదళంలో యెందరో స్త్రీలున్నారు. విమానాన్ని సరియైన స్థితిలోవుంచడంలోనూ పైలట్లుగానూకూడా స్త్రీలు పనిచేస్తున్నారు. మిలిటరీవిమానదళతరిఫీదునిచ్చే స్కూళ్ళలోనికి సివిలుపైలట్లనుంచి యెంచుకుంటారు. నౌకాదళపరిపాలకశాఖలో (అడ్మినిస్ట్రేషన్) కొందరు స్త్రీలున్నారు. కాని వాళ్లు యుద్ధనావలమీద పనిచేయరు. అయితే వర్తక నౌకలమీద పనిచేసేస్త్రీలూ, కెప్టన్లుగాకూడా పనిచేసేస్త్రీలూ ఎందరో వున్నారు.

స్త్రీలు, అఫీసర్లట్రెయినింగ్ స్కూళ్ళద్వారా సైన్యంలో ప్రవేశించాలి. వాళ్లు యేపెద్దపనికైనా వెళ్ళవచ్చును. డివిజనల్ కమేండరుపదవిలో వున్న స్త్రీలు యెందరోవున్నారు; వీరందరూ అంతర్యుద్ధపురోజుల్లో పోరాటాల్లో పాల్గొన్నవారే.

## 7. రిక్రూట్లకిచ్చే తరిఫీదు యెటువంటిది ?

ప్రతిసంవత్సరమూ పెద్దయెత్తున పోరాటప్రదర్శనాలు జరుగుతూంటాయి. ఇటీవలి సంవత్సరాల్లో యివి నిజమైనయుద్ధముల్లాగే జరుగుతున్నాయి. ప్రతిరిక్రూటూ తనరెండుసంవత్సరాల తరిఫీదుకాలంలోనూ యిటువంటి మిథ్యాయుద్ధాల్లో రెండింటిలో పాల్గొనవలసివుంటుంది. టెక్నికలు బ్రాంచిలోవుంటే టెక్నికల్ నేర్చుకుంటాడు. ప్రతిపదాతిసైనికుడూ, బాంబు, పేలుడువస్తువులు, మెషీన్‌గన్, రైఫిల్, కనీసం వీటిసైనా ప్రయో

గించడం నేర్చుకొనితీరాలి. ఇంక యుద్ధరంగంలో తరిఫీదు యివ్వడంలో ప్రస్తుతంలో చొరవను పెంపొందించే విధానంలో తరిఫీదు యిస్తున్నారు.

8. నాన్ కమీషన్డ్ ఆఫీసర్లను ఎట్లా ఉన్నతస్థానాల్లోకి (ప్రమోషన్) తెస్తారు?

నాన్ కమీషన్డ్ ఆఫీసరుగా వుండాలంటేనే హెచ్చుకాలంతరిఫీదు పొందాలి. ప్రతిబెటాలియన్ కమేండరూ తగినయువకుల్ని యెంచి తీసికొని నాన్ కమీషన్డ్ ఆఫీసర్లుగాపనిచేయుడానికితరిఫీదుపొందమని నియోగించాలి. ఇది ఒకసంవత్సరం ట్రెయినింగుపూర్తిఅయినతర్వాతనే. ఈట్రెయినింగు ఆరునెలలు; తర్వాత సర్వీసు ఒకసంవత్సరము. మొత్తం సుమారు 3 సంవత్సరాలవరకూ పనిచేయాలన్నమాట; యీకాలానికిమించి పనిచేసేవాళ్ళు అరుదు. అటుతర్వాత ఆఫీసరుగా నియమించబడనిచో యింటికిపోవచ్చును. వీరంతాఆఫీసర్లు "రిజర్వు"గా వుంటారు.

9 ఆఫీసర్లుగా యెల్లా తీసుకుంటారు?

సాధారణంగా ఆఫీసరంటే, తరిఫీదు పొంది, సైనికవృత్తిని తీసుకునేవాడు. రేంకరు లేక నాన్-కమీషన్డ్ ఆఫీసరంటే మిలిటరీ తరిఫీదుపొంది, చేయవలసిన సర్వీసుచేసి, పౌరజీవితానికి మరలిపోయేవాడు. ఆఫీసర్లు, ఈరీతిగా నియమించబడతారు. 1. బెటాలియన్ కమేండరుచేత యెంచబడి, ఆఫీసర్ల స్కూలుకు వెళ్లినవాళ్ళలో సమర్థులైనవాళ్ళు. రేంకర్లుకూడా ఒక్కొక్కప్పుడు యిట్లాగే యెంచబడుతూంటారు. ఆఫీసర్లకు సెకండరీవిద్య పూర్తై వుండాలి. రేంకర్లు సెకండరీవిద్య పూర్తిచేసివుండకపోతే తిరిగి సెకండరీస్కూలుకు పంపి తర్వాత ఆఫీసర్ల స్కూలుకు పంపుతారు. 2. మిలిటరీలో ప్రవేశించదలచిన సెకండరిస్కూలు విద్యార్థులకు 3,4 సంవత్సరాలు మిలిటరీ, ఆఫీసర్ల ట్రైనింగు యిచ్చి, రిక్రూటు చేస్తారు. వీళ్ళలో కొందరు తమ సెకండరీస్కూలుకాలంలోనే ప్రత్యేక మిలిటరీ శిక్షణా

తరగతులకు వెళ్ళి, తర్వాతి ట్రైనింగు కాలం తగ్గించుకోవచ్చు. అరుదుగా, ప్రత్యేక సందర్భాల్లో మాత్రం, సెకండరీవిద్య పూర్తిచేయలేని సైనికుల్ని కూడా మిలిటరీ నైపుణ్యంలో ప్రథమశ్రేణిలోకి వస్తే మాత్రం సైన్యంలో ఆఫీసర్లుగా నియమిస్తారు. కాని, అటువంటి సందర్భాలు యిటీవల మరీ అరుదుగా వుంటున్నాయి. ఆఫీసర్లు, తమ జీవితమంతా సైన్యంలోనే గడుపుతారు. పదవినిబట్టి రిటైరయే వయస్సు మారుతుంది. అంతేగాక ఉన్నతపదవుల కర్హత సంపాదించలేనివాళ్ళకికూడా యీ వయసు తక్కువలోనే వుంటుంది.

## 10. డిసిప్లిన్ యెట్లా వుంటుంది?

డిసిప్లిన్ చాలా ఖచ్చితంగా వుంటుంది. వేళ మీరక తన విధులు నిర్వర్తించడంలోనూ, 'సెంట్రీ-డ్యూటీ' (పహరా) యివ్వడంలోనూ మరీ నియమబద్ధంగా వుండాలి. డ్యూటీలో వున్నపుడూ, మామూలు సమయాల్లోనూ కూడా ఆఫీసర్లకు 'సెల్యూట్' చేస్తూంటారు. ఉత్తర్వులు, ఆజ్ఞలు సరిగా నిర్వర్తించాలి. లేనిచో శిక్షలు విధిగా అనుభవించాలిసిందే.

కాని ఆఫీసర్లకూ (వీరే సీనియర్ కమేండర్లు) నాన్‌కమీషన్డ్ఆఫీసర్లకూ (వీరు జూనియర్ కమేండర్లు) సామాన్యసైనికులకూ (వీరినే రెడ్ ఆర్మీమన్ అంటారు.) సామాజికంగా హెచ్చుతక్కువలుండవు. ఎందుచేతనంటే పట్టణాల్లోగాని, పల్లెల్లోగాని, పౌరజీవితంలో యెక్కడా వర్గభేదాలు లేకపోవడంవల్లనే సైనికులు తమకలనల్‌ను 'కామ్రేడ్ కలనల్' అని పిలుస్తారు; కలనలు తనపటాలంలోని సైనికుల్ని పేరుపెట్టిగాని, అంతగా ముఖమెరుగని వానినైతే "కామ్రేడ్ రెడ్ - ఆర్మీమేన్" అనిగాని పిలుస్తాడు. యుద్ధప్రదర్శనాలతరువాతగాని, యుద్ధాలతర్వాతగాని ఆఫీసర్లూ, సైనికులూకలసి కూర్చుని నేర్చుకోవలసిన పాఠాల్ని చర్చిస్తారు. రెడ్ఆర్మీక్లబ్‌లలో ఆఫీసర్లూ, సైనికులూకలిసి కూర్చునే భుజిస్తారు. సినీమాల్లోను, థియేటర్లల్లోనుకూడా ముందుసీట్లు ఆఫీసర్లకూ, వాళ్ళకుటుం

బాలకూ ప్రత్యేకించబడవు. ముందుగా రెడ్ ఆర్మీ సైనికుడు తనకుటుంబంతో వచ్చి కూర్చుంటే, తర్వాతవచ్చిన ఆఫీసరు తనకుటుంబంతో వెనుకగా కూర్చోవలసినదే.

## 11. ఆఫీసర్లకు సేవకులుంటారా ?

రెడ్ ఆర్మీలో వ్యక్తిగతంగా సేవకులు, బ్రిటిష్ ఆర్మీలోని "బాట్ మన్" లాంటివాళ్ళు వుండరు. ఒకసారి యీ గ్రంథకర్త, రెడ్ ఆర్మీక్లబ్ లోకిపోయి ఆర్మీ ఆఫీసరుతో మాట్లాడుతూ ప్రశ్నించినప్పుడు, అతడు "నాబూట్లు రంగువేయమని సాధారణ సైనికుణ్ణి నియోగిస్తే చట్టప్రకారం శిక్షించబడతాను" అన్నాడు. అది ప్రక్క నేవుండి వింటూన్న సైనికు డొకడు, ఆ పనినే తనభార్యచేత చేయిస్తే అతడు "గోడ - పత్రిక"లో విమర్శించబడతాడు అని చేర్చేడు.

కాని అశ్వదళంలోని ఆఫీసర్లకుమాత్రం గుర్రమును చూడడానికి ఒక్క "ఆర్డర్లీ" వుంటాడు. ఆఫీసర్లు స్థిరంగా సైనికజీవితం గడపవలసివుంటుంది. కనుక వాళ్ళకుటుంబాలకు ప్రత్యేకమైన వసతిగృహాలుమాత్రం వుంటాయి. సామాన్యసైనికులు తాత్కాలికంగా $2\frac{1}{2}$ లేక 3 సంవత్సరాలు మాత్రమే వుంటారు గనుక వాళ్ళందరూ బారక్సులోనే వుంటారు. యుద్ధ సమయాల్లో, సహజంగానే ఆఫీసర్లూ, అతని ఆర్డర్లీలూ కూడా ఒక "బ్లిండేట్" (చిన్నగది) లోనే వుంటారు; ఒకచోటనే భుజిస్తారు.

## 12. జీతాల విషయం ఏమిటి ?

సాధారణ పౌరజీవితంలో, యేవృత్తినైనా చేసుకొనేవాని జీతంతో సమంగానే వుంటాయి ఆఫీసర్ల జీతాలు; గత 5, 6 సంవత్సరాలల్లోను అన్ని యితరవృత్తులలోకివలెనే, వీళ్ళ జీతాలు 3, 4 రెట్లు పెరిగినాయి. (సోవియటు యూనియన్‌లో మానవుని ఉత్పత్తిశక్తితోబాటు, సంపదతోబాటు 'వేతనాలు' లేక జీవితవ్యయపరిమాణం నిరంతరం పెరుగుతూనే

వుంటుంది.) సైనికుని జీతం, నిర్బంధ సైనిక శిక్షణ వున్న యితర దేశాలకి వలెనే ఖర్చుకు సరిపడివుంటుంది. అది యెంతా అంటే సోవియటులో నిరంతరం పెరుగుతూనే వుంది. బ్రిటన్‌లో సోల్జర్సు డబ్బిచ్చి కొనుక్కోవలసిన వెన్నో,—సబ్బులు, నూనె, రేజర్లు, సిగరెట్లు, బైట సినీమా, నాటకాలు వగైరాలు,—సోవియటు సైనికునికి ఉచితంగానే లభిస్తాయి. రెడ్ ఆర్మీక్లబ్ లలో నాటకాలు, సినీమాలు, వగైరా వినోద విజ్ఞానసాధనాలుంటూనే వుంటాయి. ప్రతి సైనికుడికీ యూనిఫారం బట్టలు, బూట్లు వగైరాలు యివ్వబడతాయి. అతడు పనిచేసే కాలం గడిచి, యింటికి పోయేటప్పుడు, వాటిని ఆతడు తీసికొనిపోవచ్చును.

## 13. సైనికుల కుటుంబాలకు అలవెన్సులు యిస్తారా ?

రెడ్ ఆర్మీలోని ప్రతిసైనికునియొక్క కుటుంబంలోని వాళ్ళలో 'సంపాదించుకోలేని' వారి కందరికి అలవెన్సులు యిస్తారు. "సంపాదించుకోలేని" అనే మాటకు, 16 సంవత్సరాల వయస్సుకు లోపుగావుండే పిల్లలు, తమ్ముళ్లు, చెల్లెళ్ళు, (స్కూలులో చదువుతూన్నవాళ్ళయితే 18 సంవత్సరాలువరకూ) 60 సంవత్సరాలు దాటిన తండ్రి, 55 సంవత్సరాలు దాటిన తల్లి, వీరంతా అని అర్థం. వీరందరికీ అలవెన్సులుగాక ప్రతి సైనికుని కుటుంబానికీ గృహవసతి, అతని కుటుంబంలో పనిచేయగలవారికి పని, అతని కుటుంబంలోని పిల్లలకు చదువు,—యివన్నీ వారు నివసించే స్థానంలోని సోవియట్లు యేర్పాటు చేయాలి. ఏ పరిస్థితులలోనైనా సరే ఒక సైనికుని కుటుంబాన్ని వారు కాపురమున్న యింట్లోనుంచి తొలగించకూడదు.

## 14. రెడ్ ఆర్మీలో చదువు చెపుతారా?

శాంతిసమయాల్లో సాయంకాలం చాలసేపు విద్యకై ప్రత్యేకించేవారు. వెనుకటిరోజుల్లో, చదువురానివాళ్ళు యెక్కువగా వున్నప్పుడు,

వ్రాయుట, చదువుట, చరిత్ర, లెక్కలు, సామాజిక రాజకీయ పరిజ్ఞానం వగైరాలన్నీ తప్పక చెప్పేవారు. అక్కడ తయారైన రెడ్ సైనికులు తమతమ ప్రాంతాలకు పోయి వెనుకబడివున్న ప్రజల్లో విద్యను, విజ్ఞానాన్ని వ్యాప్తిచేస్తూ, ఆత్మవిశ్వాసాన్ని, స్వయం సహాయాన్ని కలిగిస్తూండేవారు. క్రమంగా ప్రజలు విద్యావంతులైనారు. ఇప్పుడు సైనికులు విద్యాబోధకులుగా, రాజకీయ ప్రచారకులుగా వుండనక్కరలేదు. అంచేత వాళ్ళకి మిలిటరీ టెక్నిక్, యెత్తుగడలు బాగా నేర్పుతూన్నారు. ఆటపాటలు, పందెములు, నాటకాది కాలక్షేపాలు వుంటాయి. రెడ్ఆర్మీలోని ఆర్కెస్ట్రాలు, పాటకులు, నటకులు చాల ప్రసిద్ధిపొందినవాళ్ళు. రెడ్ నౌకాదళం లోనివాడైన "బైషెన్ కో" ప్రపంచ ప్రసిద్ధిపొందిన గజయీతగాడు. అతడు బారయీతలో ప్రపంచములోనే ప్రథముడు.

## 15. రాజకీయ సలహాదార్లు (Political commissars) అంటే ఎవరు ? ఎందుకు ?

సైనికుల్లో జ్ఞానాభివృద్ధిచేయడం, వీళ్ళవిధులలో ఒకటి. వెనుకటి దినాల్లో జారుసైన్యాల్లోని ఆఫీసర్లనే రెడ్ఆర్మీలో నియమించవలసివచ్చేది. వాళ్ళు సమర్థులైనా విశ్వాసపాత్రులు కాకపోవడంవల్ల రాజకీయసలహాదార్లను నియమించి, కార్యనిర్వహణబాధ్యతను వాళ్ళమీద వుంచేరు. ప్రస్తుతం యిది అవసరంలేదు. ఇప్పుడు యీపదవిని తీసేసి యితని విధులన్నీ అసిస్టెంటుఆఫీసరుమీద వుంచేరు. ప్రస్తుతం ఆఫీసర్ల అధికారానికి తిరుగులేదు. అసిస్టెంటుఆఫీసరు ముఖ్యంగా సైనికుల్లో నైతికబలాన్నభివృద్ధి చేస్తూండాలి. అంటే రాజకీయజ్ఞానాన్నివ్వడం, వార్తాప్రచారం, ప్రశ్నలకు సమాధానాలివ్వడం, చర్చలు నడపడం; ప్రతిసైనికుడూ ప్రపంచంలో యేమిజరుగుతూందో, తాను యెందుకు పోరాడుతూన్నాడో, తెలుసుకునేటట్లు చేయాలి; సైనికుల యోగక్షేమాలు చూడడం, కమిసేరియట్‌ను, బిల్లెట్‌లను చెక్ చేయడం సైనికుల్లో యెవరూ అసంతృప్తిపడకుండా యెవ

రికీ అన్యాయం జరగకుండా చూస్తూండడం, యివన్నీ అసిస్టెంటు ఆఫీసరు పనులే.

## 16. సైనికులకు పౌరహక్కు లుంటాయా?

సాధారణపౌరునికుండే హక్కులన్నీ సైనికునికీ వుంటాయి. ఈ హక్కులు రెడ్ ఆర్మీవాళ్ళకీ, రెడ్ నావికాదళంవాళ్ళకీ, ఆఫీసర్లకూ, కేంకర్లకూ, సామాన్యసైనికులకూ, స్త్రీ పురుషులకూ, రష్యన్లకు, ఇతర జాతులవారికీ - అందరికీ సమానంగానే వుంటాయి. అందరికీ వోటుంటుంది; సోవియట్ కు చివరకు సుప్రీమ్ సోవియట్ కూకూడ ప్రతివోటరూ యెన్నుకోబడడానికి హక్కుంది. (ఎందరో కేంకర్లుకూడా సుప్రీమ్ సోవియటులో సభ్యులుగా యెన్నుకోబడ్డారు.)

బారక్సులోనూ, క్యాంపులలోనూ జరిగే ఉత్సవాలకూ, కాన్ఫరెన్సులకూ సమీపంలోవున్న ఫ్యాక్టరీలనుంచీ, సమిష్టిక్షేత్రాలనుంచీ ప్రతినిధులు వచ్చి పాల్గొంటూవుంటారు; అల్లాగే సైనికుల ప్రతినిధులుకూడా సమీపంలోని రైతుకార్మికసభలకూ, సమావేశాలకూ, పండుగలకూ హాజరవుతూంటారు. బ్రిటన్ మొదలైనదేశాల్లో రెజిమెంట్లకు సమీపంలోవుండే జమీందార్లు, ప్రభువులూ వాటికి "పోషకులు" (Patrons) గా వుంటూంటారు. అల్లాగే సోవియటుయూనియన్లోకూడా ప్రతిరెడ్ ఆర్మీదళమూ, వాళ్ళకి దగ్గరలోనున్న ఫాక్టరీచేతనో, సమిష్టిక్షేత్రంచేతనో "దత్తత" చేసుకోబడుతూంటుంది, లేదా తానేవాటిని "దత్తత" చేసుకుంటూంటుంది. సైనికులకు కావలసినవాటిని సప్లయిచేస్తూ, వాళ్ళయోగక్షేమాలు చూస్తూంటారు. కూలీరైతులు, సైనికులుకూడా కూలీరైతులకు మిలిటరీతరఫీదు యివ్వడం, పని రద్దీగావుంటే వాళ్ళకితోడ్పడి పనిచేయడం, టెక్నికలు తరఫీదు యిస్తూండడం, మొదలైనవెన్నో సహాయాలుచేస్తూంటారు. ఈ రీతిగా సైనికులకూ ప్రజలకూ అన్యోన్యసంబంధాలు యెక్కువగా వుంటాయి. సోవియట్లదేశంలో అన్నియితరదేశాల్లోనూ ప్రజలనుంచి సైనికుల్ని దూరంగా వుంచుతూవుండడం పరిపాటి.

## 2. ఎత్తులు - ఆయుధాలు.

### 17 రెడ్ ఆర్మీ ఎంతపెద్దది ?

సోవియటు అధికారులుతప్ప మరెవరికీ రెడ్ ఆర్మీబలం తెలియదు. ఒక్కటిమాత్రం చెప్పగలం. తరిఫీదుపొందినయోధులు మరేయితర దేశం కంటేనూకూడా సోవియట్ లో అత్యధికంగా వున్నారు. యుద్ధంప్రారంభించినప్పటినుంచీ సరిహద్దులకరుణకై లక్షలకొద్దీ సైనికుల్ని సాయుధుల్ని చేసివుంచేరు రష్యాలో.

### 18. దూరప్రాచ్యంలో వేరుగా సైన్యంవుందా ?

ఔను, వుంది. ప్రత్యేకసైన్యం, ప్రత్యేకసప్లయిస్థానాలూ, ప్రత్యేక కమాండుకూడా వున్నాయి. చాలసంవత్సరాలుగా యీవిధానాన్ని అభివృద్ధిపరిచేరు. పశ్చిమానయుద్ధం ఎంతభీషణంగావున్నాసరే, దూరప్రాచ్య సైన్యానికి ఆయుధాలు, టాంకులు, విమానాలు వగైరాలన్నీ ప్రత్యేకంగా నిలవచేయబడివుంటాయి. దూరప్రాచ్యసైన్యం ఎంతవుంటుంది? వాటిబలం నాయకత్వం యెటువంటివి ? వీటికి సమాధానాలు, జపాన్ వాళ్ళకి చాల అవసరం. అంచేతనే మనకూ అదిరహస్యమే.

### 19. రెడ్ ఆర్మీ, ఆత్మరక్షణమాత్రంతో తృప్తి వహిస్తుందా ? లేక శత్రువుమీదే యెదురుదాడులు చేస్తుందా ?

చాలకాలంక్రిందటే రెడ్ ఆర్మీ, యంత్రబలాలతో, విమానాలతో సహా తీవ్రదాడులు చేయడం "ప్రాక్టీసు" చేసింది. అప్పటికింకా 'రీచ్ ష్వెర్' (జర్మనుసైన్యం) యీవిధానాన్ని నేర్వనేలేదు. కాని, రెడ్ ఆర్మీకి యీ మెరుపుయుద్ధంలో విశ్వాసంలేదని, సోవియట్ యుద్ధవిశారదులు వ్రాసేరు. ఎంచేతనంటే, దాడిచేసే సైన్యాలు, శత్రుదేశంలోకి చొరుచుకుపోతూన్నకొద్దీ, వీళ్ళకు బల్ఘం తగ్గడం, శత్రువుల నిరోధకశక్తి

పోచ్చుదం తటసిస్తుంది. శత్రువులు టాంకులతో 'మెరుపుదాడి' చేస్తే, దానిని సైన్యపంక్తులతో యెదుర్కోజాలమనీ, తీవ్రమైన యెదురుదాడులు టాంకులతోనే చేసి, యెదుర్కోవాలనీ, రెడ్ ఆర్మీ నిపుణులు ప్రకటించే వున్నారు. శత్రువు యెంత ప్రదేశంలో దాడిచేస్తున్నాడో, దానిమీద మన ప్రతిఘటన ఆధారపడి వుంటుంది. అంచేతనే "మాజినాట్" దుర్గ శ్రేణులు నిర్మిస్తే చాలుననే భ్రమ, సోవియటు నిపుణులకు లేదు. అయినా వెనకటి యెల్లలోనూ, కొత్తసరిహద్దుల్లోనూ కూడా తగిన రక్షణలు నిర్మించకపోలేదు. జర్మన్ సైన్యాలు దాడిచేసేటప్పుడు, సోవియట్ సరిహద్దులోని "పిల్-బాక్స్"లు (కాంక్రీటులో కట్టిన చిన్నగదులు. దానిలో వుండి సురక్షితంగా శత్రువులపై నిప్పులవర్షం కురిపించవచ్చు.) దుర్భేద్యంగా వుండి చాలా నష్టాన్ని కలగచేసేయని వాళ్ళే వ్రాసేరు. చిచ్చుబాంబులతో లోపలవున్న మందుగుండ్లు ప్రేలిపోయినా, నేలలో వున్న మకాం గదుల్లోంచే రెడ్ గార్డ్లు భయంకరంగా పోరాడేరని జర్మన్ లే వ్రాసుకున్నారు.

## 20. రెడ్ ఆర్మీ, యాంత్రికం చేయబడిందా ?

ఏయితరదేశాల సైన్యాలకంటెనూ సోవియట్ ఆర్మీకి యంత్ర సహాయం యెక్కువగానే వుంది. (ఇప్పుడు యూరోపులోని అన్ని దేశాల ఆయుధాగారాలు జర్మనీ పాలబడడంచేతనే వారికి సోవియటుకంటె విమానాల్లోనూ, టాంకులోనూ ఆధిక్యత కలిగింది.) అన్నిదళాలూ, చివరకు అశ్వదళాలు కూడా యంత్రసహాయం కలిగివున్నాయి! 1936 లో కీవ్ లో యుద్ధప్రదర్శనాలు జరిగేయి. అప్పుడు మిలిటరీ నిపుణులు వేసిన అంచనాలో, దూరప్రాచ్యాన్ని మినహాయించి, ఒక్క యూరోపియన్ రష్యాలోనే 10 వేల టాంకు లున్నా యన్నారు. 1940 లో ఫ్రాన్సు మీది దాడిలో జర్మనీ 7500 టాంకుల్ని ప్రయోగించింది. అదే జర్మనీ యొక్క టాంకుల పరిమితి యని 'మ్యాక్సు వెర్నర్' అనే యుద్ధశాస్త్రజ్ఞుడు

వ్రాసేడు. వోరోషిలోవ్, ఒకసారి మాట్లాడుతూ, 1934 నాటికి ఒక్కొక్క రెడ్ సైనికునికి 7.74 గుర్రాల శక్తిగల యంత్రాల సహాయం వుండనీ, 1939 నాటికి 13 గుర్రాల శక్తిగల యంత్రసహాయం వుందనీ చెప్పేడు. అప్పటినుంచి యిప్పటివరకూ సోవియటు యూనియన్ వెనుకబడి వూరుకోలేదని అందరకూ తెలుసు.

## 21. రెడ్ ఆర్మీకి గుండ్లు కాల్చగల శక్తి యెంత వుంది?

1938 లో వోరోషిలోవ్ వేసిన అంచనాలో, ఒక జర్మన్ రైఫిల్ దళం ఒక నిమిషంలో 58.4 టన్నుల లోహాన్ని విసరగలదనీ, రెడ్ ఆర్మీ రైఫిల్ దళం 79.5 టన్నులు విసరగలదనీ (ఫిరంగులు, రైఫిళ్ళు, మెషిన్-గన్‌లు, మోర్టారులు, బాంబులు, తుపాకులు మొదలైనవాట్లన్నిటితోనూ కలిసి) చెప్పేడు. కాక్స్ 'రెడ్ ఆర్మీదాడి' అనే గ్రంథంలో "ఫిన్లాండు యుద్ధంలో పదిమందిగల ప్రతిదళము (squad) కు రెండు టెలిస్కోపు రైఫిళ్ళు, ఒక తేలిక మెషిన్‌గన్, ఒక ఆటోమాటిక్ రైఫిలూ వున్నాయి. మిగిలినవాళ్ళందరికీ '1939 మాదిరి నూతన రష్యన్ రైఫిల్స్' వున్నాయి. వీటిని ఫిన్స్ చాల మెచ్చుకుండేవాళ్ళు." అని వ్రాసేడు.

## 22. రెడ్ ఆర్మీ టాంకులు ఎల్లావుంటాయి?

అన్ని సైన్యాలకువలెనే రెడ్ ఆర్మీకి తేలిక, మధ్యరకం టాంకులున్నాయి. ఇవి వేగంగలవగుటవల్ల వుపయోగకరంగానే వుంటాయి. కాని దెబ్బలకు ఆగలేవు. ఇవిగాక మరెవరికీలేని రకరకాలటాంకులుకూడా వున్నాయి. "జలచర" టాంకులున్నాయి. వీటిని ప్రిట్, డాన్యూబ్ నదులమీద ఉపయోగించి చూపేరు. డెబ్భైటన్నుల రాకసిటాంకులు, మూడుఫిరంగులు కాల్చేశిఖరాలుగలవి; మానర్‌హీమ్ లైన్‌ను నాశనంచేయడంలో యివి తమవేగాన్ని ప్రయోజనాన్ని వెల్లడిచేసేయి. (మేజరు హూపర్ వ్రాసిన "సోవియట్ ఫిన్నిష్ యుద్ధం" చూడండి.)

## 23. రెడ్ పేరాచూట్ దళాలవిషయం ఏమిటి ?

ఈ మాదిరియుద్ధచర్యను రెడ్ఆర్మీయే కనిపెట్టింది. సైనికులేగాక లక్షలకొద్దీ పౌరులుకూడ "పేరచూట్"లతో ఉరుకుటను నేర్చుకున్నారు. రష్యాలో 1934 లోనే 11 వేలమంది యువకులు విమానాలలోనుంచి ఉరికేరు. ఆటలపందెముల సందర్భంలో అప్పుడే "పేరచూట్ గోపురాల" మీదినుంచి ఉరకడంలో పదిలక్షలమంది యువతీయువకులు (సంవత్సర కాలంలోనూ) పాల్గొన్నారు. ఎత్తుయెగురుటలోనూ (36,200 అడుగులు); విమానంలోంచిఉరికిన 2 నిమిషాల 12 సెకండ్లవరకూ (25, 912 అడుగులు పడేవరకూ) పేరచూట్ తెరవకుండా వుండడంలోనూ; చాలక్రిందనుంచి ఉరకడంలోనూ (260 అడుగులు) సోవియట్ యూనియనే ప్రపంచంఅంతకీ అగ్రతాంబూలం పుచ్చుకుంది. శాంతికాలాల్లో యీ పేరచూట్ దళాలు అడవులనార్పడంలోనూ, యితరఉపయోగకరకార్యాలు చేయడంలోనూ పాల్గొంటాయి. యుద్ధప్రదర్శనాల్లో యీ పేరచూట్ దళాలు ఒక్కసారిగా 100 మంది సైనికుల్నీ, 15 తేలికఫిరంగుల్నీ, 120 మెషిన్ గన్లనూ నేలమీదికిదింపి, ఎనిమిదినిముషాల్లో యుద్ధముకు సిద్ధంగా నిలుచునట్లుగా చేయగలిగేయి. రెడ్ పేరాచూట్ దళాలు సాధారణంగా తేలిక మరఫిరంగి నుపయోగిస్తాయి. ఇది జర్మన్ల "టామీ - గన్" కంటె బరువైనది.

రుమేనియన్ నూ సెగనులమీద దాడులుచేయడంలో 1940 లోనే రెడ్ పేరాచూట్ దళాలు చురుకుగా పనిచేసేయి.

## 24. రెడ్ఆర్మీ, గుర్రపుదళాన్ని యెందుకు వుపయోగిస్తూంది?

రెడ్ఆర్మీలోని అశ్వికదళం 1914 నాటి అశ్వికదళాల్లా వుండదు. ప్రతిఅశ్వదళానికీ టాంకులూ, విమానాలూ వుంటాయి; మోటార్లు ట్రక్కులు, వివిధయంత్రసాధనాలు వుంటాయి. అశ్వికులకు బారుకత్తులే గాక తేలికమరఫిరంగులూ, ఆటోమేటిక్ రైఫిల్సూకూడా వుంటాయి.

కొన్నికొన్ని ప్రదేశాల్లో యిట్లాటిఅశ్వదళం చాలవుపయోగకరమని సోవియట్ యుద్ధనిపుణలవుద్దేశ్యం. పేరాచూట్ దళాలుదిగి, యుద్ధానికి సంసిద్ధపడకుండానే వాటిని చుట్టుముట్టడంలోనూ, నదులుదాటి శత్రువుల మీదపడడంలోనూ, యివి మోటారుదళాలకంటె వేగంగా పనిచేయగలవని ప్రస్తుతయుద్ధమే ఋజువుచేసింది.

**25. కొత్తరకం విమాన వ్యతిరేకసాధనాలేవైనా రెడ్ఆర్మీకి వున్నాయా?**

ఈ సంగతి రెడ్ఆర్మీకే తెలియాలి. కాని, ఫిన్లాండు యుద్ధంలో ఒక విషయం స్పష్టమైంది. మానర్ హీమ్ వైన్ ను యెదిరించడానికై సప్లయిలన్నీ లెనిన్ గ్రాడ్ నుంచి ఒక్క రైల్వేబ్రిడ్జిమీదుగా తీసుకురావలసివచ్చింది. రాత్రులు దీర్ఘంగా వున్నా, ఫిన్నిష్ సైన్యానికి 300 విమానాలున్నా, ఒక్కసారైనా, ఒక్క విమానమూ ఆబ్రిడ్జీమీద బాంబులు వేయలేకపోయింది! (మేజర్ హూపరు వ్రాసిన 'రష్యాఫిన్లాండుయుద్ధం')

**26. 'విషవాయు' యుద్ధానికి సిద్ధంగా వుందా?**

రెడ్ఆర్మీ "రసాయనశాఖ" చాల జాగ్రతగా బాహుళ్యంమీద విషవాయుకవచాలను, ఆజ్ బెస్టోస్ దుస్తులను (యివి తడవవు, కాలవు) ధరించిన యుద్ధప్రదర్శనాలు చేయించింది. ఈ రసాయనశాఖ పొగతో కృత్రిమ మేఘాల్ని సృష్టించగలదు. ప్రజలలో లక్షలకొలదిగా స్త్రీపురుషులకు విషవాయు రక్షణలను వుపయోగించడంలో తరిఫీదు యిచ్చివుంది.

**27. రెడ్ఆర్మీవద్ద రహస్యాయుధాలేమైనా వున్నాయా?**

అవి రహస్యమే అయితే నాకు మాత్రం యెలా తెలుస్తాయి? అసలు సంగతేమిటంటే, మనం రహస్యం అనుకునేవన్నీ సంవత్సరాల క్రిందట కనిపెట్టబడినవే. ఇవి రెడ్ఆర్మీ యుద్ధప్రదర్శనాల్లో బహిరంగంగా

చూపబడినవే! బాంబర్లు—టాంకులుతో. ఒక్కసారిగా దాడిచేయడమూ, పేరచూట్‌లు, పొగవెనకనుంచి దాడిచేయడమూ, గ్లయిడర్లను విమానం వెనక లాక్కొచ్చి, సైన్యాలు దింపడం, యివన్నీ సోవియట్ యూనియన్ చాలకాలంక్రిందటే కనిపెట్టింది. క్రీట్ యుద్ధంలో జర్మన్‌లు ఒక్కొక్క విమానానికి ఆరు గ్లయిడర్ (చిన్న నావ) లను కట్టి లాక్కొచ్చి పటాలాన్ని దింపేరు; రెడ్ విమానదళం కొన్ని సంవత్సరాలక్రితమే ఒక్క విమానం 29 గ్లయిడర్లను లాగడం చూపేరు. "మేనర్ హెమ్‌లైన్" అనే ఫిల్ములో రెండు కొత్త ఆయుధాల్ని రష్యన్‌లు ప్రయోగించడం చూసేము. ఒక్కొక్క టాంకుకు వెనకాల కవచితములైన జారుడుబండ్లు (sligh) కట్టి, దాడిచేయడం; మంచుక్రింద కప్పడివున్న మందుగనుల్ని కనిపెట్టడానికి పొడుగాటి కర్రలకు చివర అయస్కాంతపువలయాలున్నా; యీలాగే ఆయా ప్రత్యేక పరిస్థితుల్లో పాతబడిన నూతన ఆయుధాలూ, విధానాలూ రెడ్‌ఆర్మీకి లేకపోలేదు.

## 28. రెడ్‌ఆర్మీ అన్ని వాతావరణాల్లోనూ పోరాడగలదా?

ఉష్ణప్రదేశాలు, ఎడారులు, బంద్రాలు, అడవులు, పర్వతాలు, అతి శీతలప్రదేశాలు,—అన్నిరకాల శీతోష్ణాలూ సోవియటు యూనియనులో వున్నాయి. స్టెప్పీ లేక మైదానాల్లో టాంకులు మొదలైన యంత్రసాధనాలతో యుద్ధం చేయడంలో ప్రత్యేక కృషి చేసినా, మిక్కిలి ఉష్ణ పరిస్థితుల్లో మోటారుదళాన్ని పోరాడించడంలో కూడా పేరొందినాయి రెడ్‌ఆర్మీదళాలు. ఇంక సోవియటుదళాలు సహించగలంత శీతలాన్ని మరే యితర దేశపు సైన్యాలూ భరించలేవని లోకవిదితమే గదా!

ధృవప్రాంతాల్లో మోటారు యింజన్లను నడపాలంటే నూనెనూ, బొగ్గునూ కూడా ఆయా టెంపరేచర్లకు సరిపడేటట్లుగా ప్రత్యేకంగా తయారుచేసుకొని వుండాలి. సాధారణంగా ఉత్తర ధృవప్రాంతశీతలం— 25 డిగ్రీ లుంటుంది. ఫిన్నిష్ దండయాత్రకు యీ టెంపరేచరులో పనికి

వచ్చేటట్లుగా పెట్రోలు వగైరాలు సిద్ధపరచేరు. కాని ఒక్కొక్కసారి రోజులపర్యంతం శీతలం—50 డిగ్రీలువరకు పడిపోయేది. అల్లాంటప్పుడు టాంకులు, మోటార్లు రోజుల పర్యంతం యెందుకూ పనికిరాకుండా పోయేవి. (మేజరు హూపర్) అన్నిదశాలకూ 'స్కీ-యింగ్' (మంచు మీద పొడుగాటి కర్రలతో జారుతూ పరుగెత్తడం) అలవాటు లేకపోడం గొప్ప ప్రతిబంధకంగా వుండేవి. వెంటనే యీలోట్లు సవరించుకున్నారు రష్యన్లు. వేసవిలో యీతనేర్చినట్లే, ప్రతిచోటా సైనికులూ, పౌరులూ కూడ స్కీయింగ్ నేర్చేరు. దేశమంతా వేలకొలది స్థలాల్లో యీ పోటీ పందేలలో లక్షలకొద్ది పాల్గొన్నారు.

ఫిన్లాండు యుద్ధంరోజుల్లో పత్రికలన్నిటిలోనూ రెడ్ఆర్మీ బట్టలు పాడుగా వున్నాయనీ, బూట్లు బద్దలైవున్నాయనీ తెగప్రచారం జరిగింది. కాని, స్వయంగా చూచివచ్చిన నిపుణులు (కాక్స్) రెడ్ఆర్మీ సాధన సంపత్తి యే పాశ్చాత్య సైన్యపు పరికరాలకూ తీసిపోదని వ్రాసేరు. కనివిని యెరుగని చలికి ప్రత్యేకంగా తయారుచేసినవిగాని ఆగలేవు. అటువంటివి తర్వాత రెడ్ఆర్మీకి సప్లయి చేయబడినాయి.

**29. రెడ్ఆర్మీకి యంత్రనైపుణి, టెక్నికలు నేర్పు కొరతగా వున్నాయా? ఈ యంత్రాల్ని బాగుచేసి నడిపే శక్తి వుందా?**

ఆర్కిటిక్ ప్రాంతంలో సోవియటు పైలట్లు చూపిన నేర్పు, చేసిన అద్భుతకార్యాలు వింటే, యీ విషయంలో సందేహం తీరుతుంది. కొలది సంవత్సరాలకు పూర్వం ధృవప్రాంతంలో మునిగిపోయిన "చెల్యూస్కిన్" అనే ఓడలోని నూరుగురు పైగా జనాన్ని ఒక్కరికీ అపాయం కలగకుండా తీసుకొనివచ్చిన విమానదళం అనన్యమైన నేర్పు ప్రదర్శించింది. అయితే ఒక శతాబ్దం పైగా పారిశ్రామికంగా అభివృద్ధిపొందిన జర్మన్

ప్రజలతో సమంగా, యిరవై సంవత్సరాలనుంచే వ్యవసాయంనుంచి పరిశ్రమలలోకి వచ్చిన సోవియటు ప్రజలున్నారని యెవరూ చెప్పరు. పేద రైతులైన తన తాత, తండ్రులకూ, ప్రస్తుతపు సోవియటు పౌరునికీ హాస్తిమశకాంతరం వుంది. నేడు సోవియటు వ్యవసాయం పూర్తిగా యంత్రమయమై వుంది. లక్షలకొద్దీ ట్రాకర్లు, కంబైనలు, రీపర్లు, ట్రక్కులూ దేశం నాలుగుమూలలా వ్యాపించేయి. రిపేరింగు స్టేషనులు వేలకొలదిగా పని చేస్తున్నాయి. ఇంతగా యేయితర దేశమూ, చివరకు యునైటెడ్ స్టేట్సుకూడా,—యంత్రమయం కాలేదు. రెడ్ ఆర్మీని రిక్రూట్ చేసింది, మట్టి పిసుక్కొనే బీదరైతుల్లోంచి గాదు; దేశంలోని ట్రాక్టరుడ్రైవర్లు, రిపేరు నిపుణులు,—వీళ్ళే నేడు రెడ్ఆర్మీలో చేరి టాంకులూ, మోటార్లూ నడుపుతూన్నారు.

## 30. రహదారీలు, రాకపోకలు అసౌకర్యంగా లేవా?

ఈ విషయంలో సోవియటుకంటె జర్మన్‌లకు మొదట్లో యెక్కువ అనుకూలంగా వుంటుంది. జర్మన్ సైన్యాల వెనక రైల్వేలు యెక్కువగా వుండడంచేత యుద్ధసరఫరాలను వేగంగా తేవచ్చును. కాని, పెద్ద వైశాల్యంగల దేశానికి కొన్ని అనుకూలాలూ వున్నాయి; కొన్ని అననుకూలాలూ వున్నాయి. దేశంలోపలికి పోతూన్నకొద్దీ జర్మన్‌లకు యీరహదారీలు తక్కువ అవడమే పెద్ద ప్రమాదంగా తయారవుతుంది. (ఈ విషయాన్నే స్టాలిన్ తన ఉపన్యాసాల్లో చెపుతూ వచ్చేడు.)

## 31. ఆర్గనైజేషన్‌లో రెడ్ఆర్మీ బలహీనంగా లేదా?

"రష్యన్‌లు ఆర్గనైజేషన్ చేయలేరు" అనేది సామెత అయిపోయింది. సోవియటు విధానం వచ్చేక యిది అబద్ధం చేయబడింది. ఇరవై సంవత్సరాల్లో రష్యన్‌లు బ్రహ్మాండమైన తమ దేశాన్ని పారిశ్రామికంగా చేసేసేరు! మిలిటరీ విషయాల్లో కూడా యిదే జరిగింది. ఆర్గనైజేషనే

తమ ప్రత్యేక బలమని యెందరో సోవియటు యుద్ధనిపుణులు చెపుతూ వున్నారు. 1936 లోని యుద్ధప్రదర్శనాలు చూపి, విదేశీ నిపుణు లెందరో రెడ్ ఆర్మీ ఆర్గనైజింగు శక్తిని కొనియాడేరు. ఫిన్లాండు యుద్ధాన్ని చూసిన ఒక నిపుణు డిట్లా వ్రాస్తున్నాడు. జనవరిలోని స్టాఫ్ వర్కు చూసినవాళ్ళందరూ ఆశ్చర్యపడుతూన్నారు. భూసంధిమీద కనీసం యిరవై డివిజన్లైనా వున్నాయి. వాటికి సప్లయిలు పంపడానికి ఐదురోడ్లూ, రెండే రైలు మార్గాలూ వున్నాయి. సైన్యసంచాలన అతి చురుకుగా, యెక్కడా ఘర్షణలేకుండా చేసేరు. ఆయుద్ధకాలంలో యేబ్రిగేడూ కూడా మూడు రోజులకంటె యుద్ధభూమిలో వుండబడలేదు. అందుచేత యేపటాలమూ అలిసిపోకుండా పోరాడగలిగింది. ఈ స్టాఫ్ వర్కు విషయంలోనే యుద్ధ నిపుణుల అంచనాలన్నీ సాధారణంగా తప్పిపోతూంటాయి......ఒక్కొక్క ఫిరంగి రోజుకు 3 లక్షల షెల్లులు కాలుస్తూన్నా, ప్రతి ఫిరంగి దగ్గరా "మందుగుండు" గుట్టలుగా పేర్చి వుంచబడింది. ఈ సప్లయి ప్రవాహం సరిగా చూస్తూ యీతీవ్రఫిరంగిపోరాటం 16 రోజులదాకా సాగించేరు. ఈ పని చాలును, స్టాఫ్ వర్కు ఎంత నిర్మాణయుక్తంగా చేయబడినదీ తెలుసుకోడానికి.''

ఫిన్నిష్ యుద్ధాన్ని చూడడానికి పంపబడ్డ కమిషన్ కు జనరలు వేవెలు అధ్యక్షుడు. బ్రిటిష్ ఆఫీసర్లు రెడ్ ఆర్మీని గురించి యిచ్చిన అభిప్రాయం చూడండి: "నేను పూర్వపు రష్యన్ సైన్యాలను చూసేను. అంచేత ప్రస్తుతం మీరు పొందిన అభివృద్ధి నేను గమనించగలేను. మీ సైన్యాల వైఖరి చాల ఆకర్షనీయంగా వుంది. 'మార్చి' చేసేటప్పుడు మీ సహనశక్తిని చూసి, నాకే ఆశ్చర్యంగా వుంది. మీ ఆఫీసర్ల యుద్ధపంసిద్ధతా, సాహసమూ మా స్మృతిలో నాటుకొనిపోయింది. యుద్ధపరిస్థితిని విశదీకరించడంలో, గ్రహించడంలో మీ కమేండర్లు చూపే చాకచక్యం ఆదర్శప్రాయంగావుంది. అన్నియితరదేశాల్లోకంటె, ముఖ్యంగాబ్రిటన్ లో

లోకంటె మీ ఆఫీసర్లు పిన్నవయస్కులు. ఇది చాల అనుకూల్యత......
యుద్ధప్రదర్శనాల్లో మీ యోధులు యంత్రాల్ని నడిపించిన నేర్పు చూసి
వారి సాంకేతిక పరిజ్ఞానానికి నా అభివందనాలు తెలుపుతూన్నాను."
జనరలు స్టాఫ్‌లో టాంకు నిపుణుడైన కలనల్ మార్టెల్ కూడా "యుద్ధ
ప్రదర్శనాల్లో బారుటాంకుల్ని ప్రయోగించిన విధం చాల ఉత్కృష్టంగా
వుంది. యంత్రాలుకూడ మొదటి తరగతికి చెందినవే. రంగంమీద భాగాలు
చెడిపోయి నిరుపయోగమైన టాంకు ఒకటీ లేదు. విమానాలలో ప్రమా
దాలుగాని, గత్యంతరంలేక క్రిందికి దిగవలసిరావడంగాని లేదు. ఇవన్నీ
చూస్తే మీ యంత్రాలూ, యంత్రచోదకులూ కూడ మొదటి తరహాలేనని
చెప్పగలను. ఈ యంత్రా లెప్పుడూ తగు మరామత్తులో వుంచబడుతూ
న్నాయని కూడా యిందువల్ల స్పష్టమౌతూంది."

## 3. రెడ్ విమానదళం.

### 32. విమానదళంలోని పరిస్థితు లెల్లా వుంటాయి?

మిలిటరీ సర్వీసుకు వచ్చినవాళ్ళు తామే, ఏశాఖలో చేరేదీ నిర్ణ
యించుకోవచ్చు. స్వయంగానే తాము విమానదళంలో చేరుతామనే
వాళ్ళనే అందులోకి తీసుకుంటారు. శారీరకంగా మంచి దిట్టంగా వుం
డాలి, యీ వాలంటీర్లు. ఆర్మీ సర్వీసు రెండు సంవత్సరాలైతే, విమాన
దళంలో మూడేళ్ళు పనిచేయాలి. ఇదివరలో చెప్పినట్లు, స్త్రీలు కూడ
చాలమంది, విమానశాఖలో పనిచేస్తూన్నారు. ఆఫీసు స్టాఫ్‌లోనూ, పైలట్లు
మొదలైన పనుల్లోనూ కూడ స్త్రీలు పనిచేస్తారు.

### 33. విమానదళం ఎంత వుంటుంది ?

ఇది సోవియటు స్టాఫ్‌కే తెలియాలి. జర్మన్ విమాన నిపుణుడు,
కలనల్ బ్యులోవ్, 1935 లో సోవియటు విమానదళాన్ని గూర్చి వ్రాస్తూ,
కొద్దిసంవత్సరాలలోనే 10 వేల విమానాలు సోవియటు ఆర్మీకి వుంటా

యనీ, విమానాల్ని, యింజన్లనీ బాహుళ్యంమీద తయారుచేయగల అవ కాశాలు ఒక్క రష్యా, అమెరికాలకే వున్నాయనీ అన్నాడు. 1936 లో తిరిగి ఆతడే, సోవియటు యూనియన్‌తో విమాననిర్మాణంలో తూగగల దేశం యేఒక్కటీ లేదని వ్రాసేడు. (మాక్సు వెర్నర్.)

## 34. యుద్ధసమయంలో ఉత్పత్తి నిరాటంకంగా సాగుతుందా?

చాల ఫ్యాక్టరీలు దేశంలోపలగా వున్నాయి. సోవియటు విమాన ఫ్యాక్టరీలలో 'ఆటోమేటిక్ మెషిన్' లతో, స్త్రీలే పనిచేస్తారు. ఇది చూసి, విదేశీయులు పరిహాసం చేసేవారు. దీనిలోని లాభం యిప్పుడు అందరూ గ్రహించేరు. పురుషులందరూ సైన్యంలో చేరి పోరాడవలసి వచ్చినప్పుడు కూడా విమాననిర్మాణం నిలిచిపోనక్కరలేదు. ఇంక నేర్పు విషయమా ? 1933 లో ఒక జర్మన్ కంపెనీ, ఒక ప్లాంటుకు సరిపడిన యంత్రాల్ని సోవియటుకు సప్లయిచేస్తూ, జర్మనీలోని అటువంటి ప్లాంటు ఉత్పత్తిచేసే మొత్తంలో 60% ఉత్పత్తికి గ్యారంటీ యిచ్చింది. 193 నాటికి ఆవిమాననిర్మాణఫ్యాక్టరీయే, జర్మన్ ఫ్యాక్టరీ ఉత్పత్తిలో 14% తయా రుచేయగలిగింది. (H. J. A, విల్సన్—'ఎయిరోనాటిక్సు' లో, జూన్ 1941.)

## 35. వాటి తరహా, శక్తి యెట్లా వుంటూంది ?

**1936** మొదలు **1938** వరకూ స్పెయిన్ యుద్ధంలో సింగిల్ సీటర్ సోవియటు ఫైటర్లు, జర్మనీ, ఇటలీల విమానాలన్నిటికంటే ప్రశస్తమైన వని ఋజువైంది. ఉత్తరధ్రువంమీదుగా కాలిఫోర్నియాకు యెగరడంలో సోవియటుకే ప్రపంచంలో అగ్రస్థానం లభించిన సంగతి మరచిపోరు. కొద్దినెలల తర్వాత, దూరం యెగరడంలో బ్రిటన్ ప్రథమశ్రేణిని సంపా దించింది. ఇక్కడ ఒక్క విషయం మరచిపోకూడదు. బ్రిటిష్ విమానం మూడు యింజన్లది; బాగా పరిచితమైన ప్రదేశంమీద యెగరడం; గాలి

మాలు. సోవియటు విమానం, ఒక్క యింజన్ ది; ఉత్తరధ్రువంమీద యెగరడం; గాలులకు యెదురుగా పోవాలి. సోవియటు విమానాలకు ఎన్నోసార్లు "వరల్డు రికార్డు" వచ్చింది. సోవియటు, సాధారణంగా వేగంకోసమే ప్రయత్నించడంగాని, తమ యింజన్ల వేగాన్ని ప్రకటించడంగాని వుండదు. వాళ్లు దూరం, ఎత్తు, బరువు మోయడం,—వీటికోసమే యెక్కువగా ప్రయత్నించుతారు. ఇంటర్నేషనల్ ఎయిరోనాటిక్ ఫెడరేషన్ 1937 లోనే 18 మంది రష్యన్ పైలట్లు ప్రపంచానికి అగ్రస్థానం వహించినట్లు రికార్డు చేసింది. ఎత్తు—బరువు మోత రికార్డులన్నీ సోవియటు యూనియన్ వే. ½ టన్ను మొదలు 13 టన్నులవరకు బరువుతో యెగరడం, ఉదాహరణకు, ఒక టన్నుతో 41,640 అడుగుల యెత్తు, రెండు టన్నులతో 37,048 అడుగులు, పదిటన్నులతో 23,065 అడుగులు,—అన్ని సందర్భాల్లోనూ ప్రత్యేకంగా నిర్మించబడిన విమానాలతో గాక మామూలు సర్వీసు విమానాలతోనే యెగిరేరు. ఇదంతా చూస్తే, యుద్ధానికి ముందే సోవియటు విమానదళం యెంత ఉచ్ఛదశలో నున్నదీ తెలుసుకోగలము.

## 36. ఇటీవలి కొత్తరకాల విమానా లున్నాయా ?

రెడ్ విమానదళంలో ఫైటర్లు, ఛేజర్లు, తేలిక బాంబర్లు, డైవ్ బాంబర్లు, బరువు బాంబర్లు, సైన్యసహాకారవిమానాలు, సైన్యవాహక విమానాలు, టాంకువాహక విమానాలు,—అన్ని రకాలవీ వున్నాయి. పది టన్నుల టాంకును దించే విమానాలు బెస్సరేబియాలో ఉపయోగించబడినాయి. గంటకు 312 మైళ్ళ వేగం, 49500 అడుగుల యెత్తు యెగరగల ఫైటరు విమానా లున్నాయని వొరొషిలోవ్ 1939 లోనే చెప్పేడు. తేలిక బాంబరు రకం ఒకటి,—S. B. 2 అనేది 33 వేల అడుగులుయెత్తు, 1400 మైళ్ళ రేంజీ, 260 మైళ్ళ వేగం, 3/4 టన్ను బాంబు మోయగలది,—వుంది. బరువుబాంబరు T.B. 6,—29000 అడుగుల యెత్తు,

1250 మైళ్ళు రేంజీ, 280 మైళ్ళు వేగం, మూడు టన్నులు బాంబులు మోయగలది కూడా ఒక రకం వుంది. ఇటీవలి రకాలను, వాటి శక్తినీ గురించి యేమీ తెలియనీయరు. బ్రిటన్‌తో పోటీమీద జర్మనీ తన విమానాల్ని చాలా అభివృద్ధి చేసింది. అదే సమయంలో సోవియటు వూరుకుందని చెప్పలేము. శాంతి సమయంలో సోవియటు విమానబలం ప్రపంచంలో అగ్రస్థానాన్ని పొందినప్పుడు, తర్వాత కాలంలో వాళ్ళు వెనకబడ్డారని చెప్పగలమా? 1940 లో సోవియటు యూనియన్, 28 ఏవియేషన్ రికార్డులు సంపాదించింది. యుద్ధంచేసే దేశాలు పోటీలో పాల్గొనలేదు. కాని, సోవియట్లు వెనకటికంటె అభివృద్ధినే సూచిస్తున్నాయి. ప్రస్తుతం చాల మేలైనవని చెప్పబడే,—హరికేన్, స్పిట్ ఫైర్ విమానాలు కేవలం కొత్తవి గాదు. ఇటీవలి రిపోర్టుల్లో "1.18" అనే విమానాన్ని రెడ్ విమానదళం ఉపయోగించిందనీ, అది స్పిట్ ఫైర్ మాదిరిగానే వుంటుందనీ వ్రాయబడింది. ఇది జర్మన్ విమానాలమీద జయప్రదంగా వుపయోగించబడుతూందని టైమ్సుపత్రిక వ్రాసింది. సోవియట్ 6 యింజన్ల బాంబర్లు చాల ఉపయోగకరంగావుంటున్నాయనీ, జర్మన్ జూ. 878 డైవ్ బాంబర్లమాదిరివికూడా బాహుళ్యంగా రెడ్సు ప్రయోగిస్తూన్నారనీ, టైమ్సు పత్రిక వ్రాసింది.

## 4. రెడ్ నౌకాదళం.

### 37. నౌకాదళపరిస్థితు లెల్లావుంటాయి?

మిలిటరీ రిక్రూట్లలోనుంచి నౌకాదళంలో పనిచేయడానికి వాలంటీర్లను తీసుకుంటారు. వీరు 3 లేక 4 సంవత్సరాలు పనిచేయవలసివుంటుంది. నౌకాదళంలో ప్రవేశించడానికి దరఖాస్తుదారులు చాలయెక్కువగా వుంటూంటారు. నౌకాదళ ట్రైనింగు కాలేజీలో చేరడానికి, ఖాళీలకు పదిరెట్లు దరఖాస్తులు యేటావస్తూంటాయి. ఈ కాలేజీలో తరఫీదుపొంది నావికులుగానూ, చివరకి ఆఫీసర్లుగానూ పనిచేస్తూంటారు.

## 38. నౌకాదళం యెంతబలంగలది?

దీన్నిగురించికూడా యెవరూ అంచనావేయలేరు. కాని సాంప్రదాయికంగా రష్యన్ నావికులు చాల పేరొందినవాళ్ళు, వివిధదేశాన్వేషణార్థం దీర్ఘప్రయాణాలుచేసి, ధైర్యసాహసాలతో తీవ్రయుద్ధాల్లోపాల్గొని చారిత్రకప్రసిద్ధికెక్కినవాళ్ళు. జారులకాలంలో వీళ్ళకు సరియైనసాధనాలు, నాయకత్వంలేకపోయినా, రష్యన్ నావికుల కష్టసహిష్ణుత, చొరవ పేరొందినాయి. రెడ్ నౌకాదినసందర్భంలో రెడ్ నావికుడు చూడడానికి చాల ఆకర్షకంగా వుంటాడు. నౌకలు యెట్లావుంటాయోమాత్రం యెవరికీ తెలియదు 1937 వరకూ సోవియటునావల్ పాలసీ, కేవలం తీరరక్షణకు సరిపడేనౌకలుంటే చాలుననేదృష్టితో వుండేది. కాని స్పెయిన్ యుద్ధపురోజుల్లో "తాటస్థ్యవిధానం" క్రింద జర్మన్-ఇటాలియన్ సబ్ మెరైన్లు మెడిటరేనియనులో సోవియటునౌకల్ని ముంచడంతో దృష్టిమార్చుకోవలసి వచ్చింది. అప్పటినౌకాదళంలోని ఆఫీసర్లుతొలగించబడి, బలమైననౌకాదళాన్ని తయారుచేయాలనేవాళ్ళు నియమించబడ్డారు. వాళ్ళు నాలుగు సంవత్సరాలుగా పనిచేస్తూన్నారు. గాని యీకాలవ్యవధిచాలునా? పునర్నిర్మాణంచేయబడినవిగాక కొత్తనౌకలు యెన్నినిర్మించబడినాయి? కొన్ని క్రూయిజర్లు, డిస్ట్రాయర్లు, యీచోట్లు వున్నాయిగాని పెద్దనౌకలమాటేమిటి? బ్రాసీ సంవత్సరనివేదికలో కొన్నితరహాల సోవియటునౌకల వివరాలు యివ్వబడివున్నాయి, కిరోవ్ తరగతి క్రూయిజర్లు 7725 టన్నులు, 34 నాట్లువేగం, 7.1 అంగుళాలఫిరంగులు తొమ్మిదిగలవి (ఎగ్జిటర్ ఫిజీ క్రూయిజర్లకు మధ్యగావుంటాయి;) లెనిన్‌గ్రాడ్ తరగతి డిస్ట్రాయర్లు, 1900 టన్నులు, 5.1 అంగుళాలఫిరంగులుగలవి; ఇవిబాగానే వుంటాయి. కొత్తగా యుద్ధనౌకలు తయారవుతున్నాయి. అవి పూర్తిఐతేనేగాని మనకు తెలియవు.

## 39. నౌకాదళం ఎల్లా విభజించబడింది?

ప్రపంచంలో యేయితర దేశానికీకూడా సోవియటుయొక్క సమస్యలవంటివి లేవు. సోవియటుకు ఐదుప్రత్యేకనౌకాదళాలున్నాయి. మ్యాపు చూడండి తీరరేఖచూస్తే, ఐదారుప్రత్యేకసముద్రాలు కనిపిస్తాయి. దూర ప్రాచ్యంలో జపాన్‌గాని, మరేదేశంగాని రాకుండాచేయడానికి పసిఫిక్ నౌకాదళం ప్రత్యేకంగా వుండాలి. వాయువ్యంలో మర్మాన్స్కనుంచీ, తెల్లసముద్రంనుంచీ శత్రువుల్ని దూరంగా వుంచాలంటే బలమైననౌకాదళం అవసరం. ఫిన్‌లాండ్‌గల్ఫును తెరచియుంచి, లెనిన్‌గ్రాడ్‌కు శత్రువును సమీపించకుండావుంచడానికి బాల్టిక్‌సముద్రంలో ఒకనౌకాదళంకావాలి. డార్డినెల్సుగుండా తప్పించుకొనివచ్చే శత్రునౌకల నడ్డడానికీ, ఒడెస్సాను బాటుంపైపులైనును కాపాడడానికీ నల్లసముద్రంలో నౌకాదళం ఒకటివుండాలి. ఐరాన్‌నుంచి "బాకూ" నూనెగనుల్ని బెదిరించకుండా వుంచడానికై కాస్పియన్‌సముద్రంలో వేరొకనౌకాదళం వుండాలి. కొత్తగా దేశంలోని అన్నిభాగాల్ని కలుపుతూ త్రవ్వినకాలువలగుండా చిన్న ఓడలు ప్రయాణంచేయవచ్చును. ఉత్తరధృవప్రాంతంలోని "అన్వేషణా" ఫలితంగా ఏటేటా కొన్ని ఓడలు ధృవవృత్తంమీదగా మర్మాన్స్కనుంచి వ్లాడీవోస్టాక్‌కు పోవచ్చును. అయినా యీఅయిదునౌకాదళాలూ సామాన్యంగా ఒకదానికొకటి ప్రత్యేకమనేచెప్పాలి. ఇవన్నీ ప్రత్యేకంగానే నిర్మితములై ప్రత్యేకంగానే పనిచేస్తున్నాయి.

## 40. సోవియట్ సబ్మెరైన్‌లమాటేమిటి?

కొద్దికాలంక్రిందటే కుజ్నెట్‌సోవ్ మాట్లాడుతూ, సోవియటుకు జర్మనీ, జపాన్, ఇటలీలు మూడింటికీ కలిసివున్న వాటికంటె యెక్కువగానే సబ్మెరైనులున్నాయన్నాడు. ఇవన్నీ మహాసముద్రాల్లో ప్రయాణాలు చేయలేనివైనా, తీరరక్షణకుపకరించే వెయ్యిటన్నులవే. ప్రత్యేకంగా యుండుకొరకే యివి ఉద్దేశించబడి, దానికితగిన తరిఫీదు పొందివున్నాయి.

ఇవన్నీ యిటీవలితరహాల రెడ్‌సబ్మెరైన్‌లనుగూర్చి వ్రాసి వివరాలుయిచ్చి వున్నాడు. సముద్రోపరిభాగంమీద 900 టన్నులు, 15 నాట్లువేగం; మునిగినప్పుడు 1500 టన్నులు, 8 నాట్లువేగం; 4 అంగుళాలదొక ఫిరంగి, ఐదంగుళాలదొకటీ, ఒకమరఫిరంగి; 6 మొదలు 8 వరకూ టార్పెడోట్యూబులు; యివీ ఆయుధాలు. అంటే యివి బ్రిటన్ యొక్క "స్వోర్డ్‌ఫిష్"లకంటె పెద్దవి; ఛటిన్‌లకంటెచిన్నవీ అన్నమాట.

## 5. సివిలియన్‌లకు సర్వీసు.

41 సివిలియన్‌లకు, మిలిటరీట్రైనింగు, ఏ. ఆర్. పి. వగైరా విషయాలనుగురించి తెలుసునా ?

ప్రపంచంఅంతట్లోకీ సోవియటుయూనియనులోనే అతివిస్తృతమైన ప్రజారక్షణదళం, ట్రైనింగుఆర్గనైజేషనూ వున్నాయి. దీనినే "ఓసోయేవియాఖిమ్" (విమానదళం, కెమికల్‌డిఫెన్సు అభివృద్ధిచేయడానికి యత్నించేసంఘం) అంటారు. దానిలో 150 లక్షలసభ్యులున్నారు. కొన్నిసంవత్సరాలుగా వీళ్ళందరికీ విషవాయురక్షణా, అగ్నిమాపకశిక్షణాయిచ్చి తరిఫీదుచేస్తూన్నారు. వీళ్ళకు పారచూట్ ట్రైనింగుకూడా యిచ్చేరు. ఈసంఘమే అసంఖ్యాకమైన గ్లయిడరుక్లబ్‌లనూ, విమానక్లబ్‌లనూ నడుపుతూంది. 1939 లోనే ఒకపోటీపందెంలో 2,75000 మంది కార్మికులు ఒక్కొక్కడు పదేసిబాంబుల్ని విసురుతూ పాల్గొన్నారు. ఇల్లాంటివి దేశమంతటా వేలకొద్దీ జరుగుతూనే వుంటాయి. ప్రతిఫాక్టరీలోనూ "ఓసోయేవియాఖిమ్" శాఖవుంటుంది. దాని ఆధ్వర్యాన కార్మికవాలంటీర్లు ఆధునిక ఆయుధాలుధరించి వాటిప్రయోగంలో తరిఫీదు పొందుతుంటారు. రెడ్ ఆర్మీకీ ప్రజలకూ ప్రత్యక్షసంబంధం యీవిధంగా కలుస్తూంటుంది. దగ్గరలో యేదైనా ఫిరంగిదళంవున్నదంటే, ఫాక్టరీవాలంటీరుదళం దానిలో తరిఫీదుపొందుతూంటుంది. డాజెకోసల్ పరగణాలోని సమిష్టిక్షేత్రాల రైతులు, సాధారణంగా అశ్వికదళశిక్షణను పొందుతూంటారు.

యుద్ధానికిముందు, బ్రిటన్ పర్యవేక్షణక్రింద చిన్న రైఫిల్ క్లబ్ లపోటీ ప్రపంచంఅంతటికీ, జరుగుతూండేది. అన్ని దేశాల టీములూ, ఒకేమాదిరి పరిస్థితులలో పోటీచేసి తమ పేర్లు రికార్డుచేస్తుండేవాళ్ళు. 1935 మొదలు 1938 వరకూ నాలుగుసంవత్సరాల్లోనూ, సోవియటుటీములకు 3 సార్లు ప్రథమస్థానం, ఒకసారి ద్వితీయస్థానంవచ్చింది. 1938 లో యీపోటీలో పాల్గొన్న 11 సోవియటుటీములూ మొదటి 16 స్థానాల్లోనూవచ్చినాయి. అన్ని యితరదేశాలనుంచీ సాధారణంగా ఆర్మీటీములేపోటీకి వస్తూంటాయి. 1938 లో యునైటెడ్ స్టేట్సు ఇస్థోనియాల ఆర్మీటీములే పోటీచేసేయి. అదేసమయంలో సోవియటు పోటీదారులు 220 మందిలో 6 గురే రెడ్ ఆర్మీవాళ్ళు; మిగిలినవాళ్ళందరూ ఆఫీసుఉద్యోగులూ, ఫాక్టరీ కార్మికు లూను, పూర్తిగా స్త్రీలేవున్న సోవియట్ టీము ఒకటికూడా పోటీచేసింది. దానికంటె పైస్థానాన్ని పొందినవాటిలో రెండే యితర దేశాలటీము లున్నాయి. ఈవిధంగా తరిఫీదుపొందినప్రజలే యీనాడు "పీపుల్స్ఆర్మీ"లో చేరుతున్నారు. ఇది రెడ్ఆర్మీకి బాసటగా ప్రతిపట్టణంలోనూ జిల్లాలోనూ పనిచేస్తూ 'హోమ్‌గార్డు'గా పనిచేస్తుంది.

## 42. "రెడ్ క్రాసు" విషయం ఏమిటి?

సైన్యాల్లోనే రెడ్ క్రాస్ దళాలుకూడా అనుబంధంగా కలిసివుంటాయి. అవిగాక వేరుగా రెడ్ క్రాస్ ఆర్గనైజేషన్ వుంది. ఏ యితరదేశాల్లోనూలేని సంఘంఒకటి, సోవియటులోవుంది; అదే ఆఫీసర్లభార్యలసంఘం. రష్యాలో స్త్రీలు కేవలం వంటింట్లోనే పాతుకుపోయి బ్రతకరు; వాళ్ళకి గృహంలోనూ, బైటాకూడా జీవితంవుంటుంది. సైనికవృత్తిలోవుండేవాళ్లని అంటే ఆఫీసర్లను పెండ్లాడినస్త్రీలు, వాళ్ళతోబాటుగానే వుండగోరుతారు గనక వాళ్ళజీవనపంథా కొంతవరకూ చిక్కులతోగూడి వుంటుంది. వేరేవృత్తులు స్వీకరించడానికి అవకాశాలు తక్కువగనకనే ఆఫీసర్లభార్యల సంఘం స్థాపించబడింది. గుండ్లవర్షం కురుస్తున్నా, "ఫీల్డు-హాస్పిటల్సు"

ధైర్యంగా నడిపిస్తూ యింకా అనేకరీతులుగా రెడ్ఆర్మీకి సహాయంచేస్తూ యీసంస్థ యెంతో తోడ్పడుతూ వుంటుంది.

## 6 ఇతర ప్రశ్నలు.

### 43 సోవియటుయూనియన్ దీర్ఘకాలయుద్ధంచేయగలదా?

ప్రపంచంఅంతటికీ రష్యాఒక్కటే అన్ని యితరదేశాలకంటె యిందుకు సమర్థమైంది. దానికితోడు బ్రిటీష్, అమెరికన్ సహాజసంపదకూడా సోవియటుకు తోడ్పడుతూంది. త్వరలోనే విజయం కలిగితీరుతుందనే భ్రమ యెప్పుడూలేదు. దీర్ఘకాలయుద్ధం జరుగుతుందనే అందుకు సిద్ధపడుతున్నారు.

ముఖ్యమైనపారిశ్రామికప్రదేశాలు శత్రువులచేతుల్లో పడినమాట నిజమే. కాని యిటీవలిసంవత్సరాల్లో యూరల్పర్వతాలలోనూ, వాటికి తూర్పుగా వేయిమైళ్ళలోవున్న 'కుజ్నెట్స్క్'లోనూ గొప్పగొప్ప కర్మాగారాలు నెలకొల్పబడి చక్కగా పనిచేస్తున్నాయి. యూరల్ - కుజ్నెట్స్క్ ప్రాంతంఅంతా ఒకే బ్రహ్మాండమైన పారిశ్రామిక కేంద్రంగావుంది. శత్రుభీతిగల ప్రాంతాలలోనిఫాక్టరీలు, ప్లాంటులు మొదలైనవన్నీ యంత్రాలు, కార్మికులతోసహా సురక్షితప్రదేశాల్లోకి మార్చబడి చక్కగా పనిచేస్తున్నాయి.

### 44. సోవియటుయుద్ధపరిశ్రమలు బాగా పనిచేయగలవేనా?

సమర్థమైనవని ప్రస్తుతయుద్ధమే ఋజువుచేసింది. లార్డుబీవర్బ్రూక్, మిస్టర్ హారీమన్ మొదలైనవాళ్ళెందరో సోవియట్ ఫ్యాక్టరీ కార్మికుల సాంకేతికపరిజ్ఞానికీ, అభినివేశానికీ మెచ్చుకొంటూ వినతులర్పించేరు. ఎయిరోడ్రోముల్లో యుద్ధరంగంలోనూ రష్యన్ల సాహసాన్ని, నేర్పునూకూడా వారు పొగడియున్నారు.

**45. రెడ్ ఆర్మీయొక్క నైతికబలం ఎట్లుంది? పౌరుల ధైర్యోత్సాహాలు ఎట్లున్నాయి?**

రెడ్ సోల్జర్లు 'అసూయతో' తెగించి ప్రాణంపోయేదాకా పోరాడుతూన్నారంటూ, జర్మన్ నాజీసైనికులు ఫిర్యాదుచేస్తున్నారు. తునాతునకలైపోయిన గుడిసెల్లోనుంచే స్త్రీపురుషులు సింహాలవలె పోట్లాడుతూన్నారట! జర్మన్ పారచూట్‌లను చుట్టివేసి నాశనం చేయడంలో చిన్నపిల్లలు కూడా చేయూతనిస్తూన్నారు. రెడ్ ఆర్మీయొక్క, సోవియట్టుప్రజలయొక్క నైతికబలం, నిజమైనప్రజాఐక్యతఅనే రాతిపునాదిమీద నిర్మింపబడి దుర్భేద్యంగావుంది. యుద్ధంప్రారంభించకపూర్వమే దేశంలోని "క్విస్లింగు" లను హతమార్చేశారు. రష్యనులు, యూరోపులోని దేశాలన్నీ యిటువంటివాళ్ళ శల్యసారథ్యంవల్లనే నాజీలకుదాసత్వాన్ని చేస్తున్నాయి. రష్యన్ ప్రజలందరూ సాయుధులు; వాళ్ళఆయుధాలు ఆధునికమైనవి; దేశం యెవరోకొందరు ఆస్తిపరుల ప్రత్యేకాస్తిగాక ప్రజలస్వంతంగావుంది; రష్యన్ప్రజలచెమటగాని, రక్తంగాని, కొందరు దురాశాపరుల లాభాలకోసంగాదు. వర్గభేదాలుగాని, హెచ్చుతగ్గులుగానిలేవు; సైన్యాల్లో కులభేదాలులేవు. ఆఫీసర్లు, సైనికులూకూడా కూలీరైతులబిడ్డలేగాని యితరదేశాల మిలిటరీఆఫీసర్లవలె ప్రభువులూ, జమీందార్లూ గాదు; అమితత్యాగాలుచేసి విప్లవాన్ని సాధించేరు; అంతకుమించిన త్యాగం, సాహసంతో సోవియటు పునర్నిర్మాణాన్ని సాగించి, తమజీవితాన్ని సుఖశాంతిమయంచేసుకున్నారు. తమశ్రమతో భూతలస్వర్గాన్ని సృష్టించుకొన్న రష్యన్ప్రజ, తమహక్కుల్ని అన్యాక్రాంతం అంతసులభంగా చేయదు.

(ఇది 1940 జూన్ 26 న వ్రాయబడింది. దీనిలోని యాథార్థ్యం ఋజువుచేయబడింది.)

**46. రెడ్ ఆర్మీ దయాదాక్షిణ్యాలు లేనిదా?**

శత్రువులను నిర్మూలించడంలో వాళ్ళు సందేహించనిమాట నిజమే. తాత్కాలికంగా శత్రువశమైన ప్రదేశాల్లోనుంచి రైల్వేలు, ట్రక్కులు,

కొర్లు, నూని, ధాన్యం అన్నీ వీలున్నంతవరకు సురక్షితప్రదేశాలకి తీసుకుపోబడినాయి. తొలగించవీలులేనివాటినన్నిటినీ నాశనంచేసేరు. ఆక్రమిత ప్రదేశాల్లో గోరిల్లాలు శత్రువుల్ని చీకాకుచేస్తూ, రహదారీలు నాశనంచేస్తూ శత్రువుల సప్లయి స్వాధీనంచేసుకుంటూ యిండ్లు, అడవులు, పంటలు మంట పెడుతూ, శత్రువులను ముప్పతిప్పలాపెడుతూ, వాళ్ళకి సహించరాని బాధలు కలుగచేస్తారు. అయితే రెడ్ఆర్మీసైనికులు దయాపరులే. ముమ్మాటికీ అతనివంటిప్రేమమయులులేరు. ఇతరదేశాలసైన్యాల్లో ఫిన్లాండుమీద విమానదాడులనుగూర్చి విదేశపత్రికలు ప్రచారంచేసిన ఘోరకృత్యాలు, ప్రపంచంనమ్మి యీవిధంగా తలచింది. జర్మనీ, యిటలీ, ఫ్రాంకో, స్పెయినుదేశాల విమానాలు పౌరులమీద బాంబులువేసి, నిర్దాక్షిణ్యంగా, పైశాచికకృత్యాలుచేసింది; ఫిన్లాండయుద్ధంలో రెడ్విమానదళం వాయుపథములో సంపూర్ణాధికారం గలిగివున్నా వాళ్ళయిష్టంవచ్చినట్లు చేయగలిగివున్నా, వాళ్లు పౌరజనులమీద బాంబులు వేయలేదనేచెప్పవచ్చు. యుద్ధం పూర్తియైనతర్వాత ఫిన్లాండ్ప్రభుత్వపులెఖ్ఖల్ని బట్టిచూస్తే రోజుకు 4½మంది పౌరులుమాత్రం, అంటె ఒక్కొక్కదాడికి 1/3 పౌరుడుమాత్రం చనిపోయినట్లు వెల్లడిఅయింది. చిత్తంవచ్చినట్లు ప్రజలపై బాంబులు కురిపించడం సోవియట్ విమానదళం యెన్నడూ చేయదనడానికి యింతకంటె నిదర్శనం యేమికావాలి ?

ప్రతిరెడ్సైనికునికీ ఖచ్చితమైన సత్ప్రవర్తన నేర్పబడుతుంది. రెడ్ఆర్మీ, లిథుయేనియాప్రవేశించినప్పుడు, వృద్ధులుయిట్లా అంటూండేవాళ్ళు. మాజీవితంలో మూడుసైన్యాలుచూసేము; జారుసైన్యం, ప్రపంచయుద్ధపు రోజుల్లో జర్మనీసైన్యం, యిప్పుడు రెడ్ఆర్మీ. మేముచూసినవాటిల్లో యీ రెడ్ఆర్మీలో చాలసంస్కారంగలదని తెలుసుకున్నాము...... రెడ్ఆర్మీ వెళ్ళేటప్పుడు దడివిరిగినా, చేలుకలిగినా, వాళ్ళు వెంటనేదిగివచ్చి, యెంత నష్టమోఅడిగితెలుసుకుని, వెంటనేచెల్లించేసేవాళ్ళు. (రిథుయేనియా నూతన పంథా, అనే పుస్తకంలో అనాలుయిస్ట్రాంగ్ వ్రాసింది.) పోలండులో

రెడ్ ఆర్మీ ప్రవేశించినపుడు వాళ్ళకు ప్రజలు యెల్లా స్వాగతంయిచ్చేరో మనం పేపర్లలో చదివేవున్నాము. మంగోలియాలోకూడ యిదే జరిగింది. రెడ్ ఆర్మీ ఒక గ్రామాన్ని ప్రవేశించినప్పుడు అక్కడిపిల్లలకు బొమ్మలు, పుస్తకాలు, తినుబండారాలుపంచుతూ, ధాన్యాదులు బీదప్రజలకుయిచ్చి వాళ్ళల్లో రాజకీయపరిజ్ఞానంకలిగిస్తూ, ప్రచారకఫిల్ములుచూపేవారు. రెడ్ ఆర్మీకి ప్రతిచోటా ప్రజలు పువ్వులదండలతో స్వాగతంయివ్వడం, మరే సైన్యాలకైనాదూరంలో తొలగిపోవడం ఎందుచేతనో తెలియదూ ?

## 47. వాళ్ళు యుద్ధమై దీలనెట్లాచూస్తారు ?

ప్రతిరెడ్ సైనికునికీ రాజకీయపరిజ్ఞానము అంతర్జాతీయతా కలగచేయబడతాయి. శతృవుల్లో ఆజ్ఞలనిచ్చే ఆఫీసర్లకీ, ఆజ్ఞలను పాలించడమో, చావడమోతక్క వేరుగతిలేని సాధారణసైనికునికీగల భేదాన్ని ప్రతిరెడ్ సైనికుడూ యెరుగును. సోవియటును జర్మనీసైన్యాలు యెదుర్కొన్నతర్వాత రేడియోమీద మోలటోవ్ ఉపన్యసిస్తూ యిట్లాఅన్నాడు. "ఈయుద్ధం మనమీద జర్మన్ ప్రజలుగాదు తెచ్చిపెట్టింది; జర్మనీరైతుకూలీలూగాదు; జర్మన్ విద్యావంతులుకూడా ఆపనిచేయలేదు; రక్తపిపాసులూ,దురాశాపూరితులూఅయిన నాజీపిశాచులూ, వాళ్ళబానిసలూ యీభయంకరయుద్ధాన్ని మనమీద కొద్దేరు. 'రెడ్ ఆర్మీ ఎప్పుడూ శత్రువుల్లో సామాన్యసైనికులపట్ల దాక్షిణ్యాని చూపుతుంది; అయితే ఆఫీసర్లనూ, నాజీప్రభువులనూమాత్రం కనికరించదు. ఆఫ్రికాలో పట్టుబడిన యిటాలియన్ డ్యూక్ లనూ తమ చేతుల్లోచిక్కిన హెస్ వంటివాళ్ళనూకూడా బ్రిటీష్ప్రభుత్వం గుడ్లు, కోడిపిల్లలూ, షాంపేన్ యిచ్చి తెగమేపినట్లుగా సోవియట్ ప్రభుత్వం ముమ్మాటికీ చేయదు.

## 48. జర్మన్ సైన్యంతో పోల్చిచూస్తే, రెడ్ సైన్యం అనుభవం తక్కువగలదికాదా ?

ఆధునికయుద్ధాల్లో రెడ్ ఆర్మీ మూడేసార్లు పాల్గొన్నది. 1938 వ మంచూరియా సరిహద్దులో, హాసాన్ సరోవరయుద్ధంలో; ఈసందర్భంలో

సోవియటుసరిహద్దులో పలి 'చాంగ్ కూ షెంగ్' గుట్టలను జపాన్ వాళ్ళు ఆక్రమించుకొన్నారు. వెనక సరోవరము, ముందుసన్నని యిరుకుదారి. దీనిమీదినుంచే ముఖాముఖీగా (frontally) యెత్తుమీదనున్న జపాన్ సైనాన్ని ఫిరంగులతోటీ డైల్ బాంబర్లతోటీ యెదుర్కొని కొండశిఖరం దాకా త్రోసుకునిపోయింది. జపాన్ వాళ్ళు రెడ్ అర్మీకి పాదాక్రాంతులై సంధికొచ్చేరు.

1939 మంగోలియా సరిహద్దులోనే ఖాల్ కింగోల్" యుద్ధంలో ఈదఫాకూడా జపాన్ వాళ్ళే దాడిప్రారంభించేరు. జపాన్ యొక్క "ఆరో సైన్యం" చుట్టుముట్టబడి, పూర్తిగా నాశనంచేయబడింది. దాన్ని గురించి టైమ్సుపత్రిక యిట్లావ్రాసింది. "జపాన్ సైన్యాల్లో అత్యుత్తమమైనదాన్ని ఓడించి రెడ్ ఆర్మీ గొప్పవిజయాన్ని పొందింది......జపాన్ సైన్యాల్లోని టాంకులకంటె ముప్పైగజా లధికదూరం మంటల్నిచిమ్మే బ్రహ్మాండమైన టాంకులు రెడ్ ఆర్మీ ప్రయోగించిందని తెలుస్తూంది. యెదుర్కొనలేని ఫలితాలు కలిగేయి...—జపాన్ వాళ్ళు తమ 'క్వాన్ టంగ్_ఆర్మీ'నుండి అత్యుత్తమమైనవాటిని ఉపయోగించేరు. ఈకొత్తసోవియట్ టాంకుల భయంకర శక్తిని రుచిచూచినతర్వాతనే........ముఖ్యంగా జపాన్ వాళ్ళు సంధికి ఒడబడ్డారు."

1940 పిన్నిష్ యుద్ధం. ఇక్కడ టెంపరేచరు—48° సెంటీగ్రేడ్ వరకూదిగిపోయేది. ఏదేశ సైన్యాలూ, యీపరిస్థితుల్లో దాడిమాటకూడా తలపెట్టజాలవు. అల్లాంటప్పుడు రెడ్ ఆర్మీ; ముఖ్యమైనదాడి మొదలుపెట్టిన 14 రోజుల్లో 'మానర్ హీమ్' లైనును బ్రద్దలుకొట్టుకు పోగలిగింది. ఆధునికమైన దుర్గరక్షణలను ముఖాముఖీగా యెదిరించి భేదించడంలో ఒక్క రెడ్ ఆర్మీయే చరిత్రాత్మకఖ్యాతినిగడించింది. (చివరకు జర్మన్లు కూడా "మాజినాటులైను" చుట్టుతిరిగి వెళ్ళేరేగాని, దానిమీదదాడిచేయ సాహసించలేదు.) డైలీ టెలిగ్రాఫ్ పత్రిక "ఈశతాబ్దంలో రష్యన్ సోల్జర్లు యెన్నడూ యింత ధైర్యసాహసాలతో పోరాడిందిలేదు."అని వ్రాసింది.

రెడ్ ఆర్మీ యీవిజయాలుపొందినా, గతరెండుసంవత్సరాల యుద్ధాల్లోనూ జర్మన్ సైన్యాలకు అనేకయుద్ధరంగాల అనుభవం లభించింది. రెడ్ ఆర్మీలో కొద్దిమందికిమాత్రమే యుద్ధానుభవం వుంది. జయప్రదమైన పోరాటాల్లో జర్మన్లు అనుభవాన్ని సంపాదించి, మత్తిల్లివున్నారు. రెడ్ ఆర్మీకూడ త్వరితంగా నేర్చుకోవాలి. త్వరలో అనుభవాలనుంచి గ్రహించగలదా, రెడ్ ఆర్మీ ? తప్పకుండా ఫిన్నిష్‌యుద్ధాన్నిగూర్చివ్రాస్తూ, కాక్స్ "యేయితరసైన్యానికీలేని మంచిలక్షణం ఒకటి రెడ్ ఆర్మీకుంది, తానుచేసిన పొరపాట్లు, తప్పులు తెలుసుకొని దిద్దుకోవడమే యీలక్షణం" అన్నాడు.

## 49. 1939 లో కంటె యిప్పుడు (1940 లో) రెడ్ ఆర్మీ బలంగా వుందా ?

ఆ ! సోవియటుసరిహద్దులు బలవత్తరంగావున్నాయి. ఇదివరకులాగ లెనిన్‌గ్రాడ్ నగరం, ఫిన్లాండుకు గుండువేటుదూరంలోలేదు. మానర్ హీమ్ లైన్ నాశనం అయింది. హాంగోదీవి, ఫిన్లాండు అఖాతంలోని యితరదీవులూకూడా జర్మన్ విమానాలకు స్వాగతమీయవు. ప్రట్, డాన్యూచ్ నదుల వెంబడినే రక్షణలు నిర్మించబడినాయి. ఈరెండుసంవత్సరాల్లోనూ జర్మన్ దేశం యుద్ధభారాన్ని వహిస్తూంటే సోవియటు తనశక్తిని నిర్మించుకుంటూంది, రష్యాస్థితి, అంతర్జాతీయంగా వెనుకటంత క్లిష్టంగాలేదు. జర్మన్ సైన్యాలను వెనకటికంటె చాల పశ్చిమంలోనే యెదిరించవచ్చు. 1939 లోని రాయబారాల్లో, బ్రిటిష్‌ప్రభుత్వం రష్యా, తనసరిహద్దుదాటివచ్చి యుద్ధంచేయగూడదని షరతు విధించింది. ఇదంతాచూసి, 1939 కంటె 1940 లోనే సోవియటు చాలదృఢంగా వుందని చెప్పగలం.

## 50. బ్రిటన్, అమెరికాలుగాక సోవియటుఆర్మీకి సహాయులు మరెవరైనా వున్నారా ?

తప్పకుండా నాజీయుద్ధయంత్రాన్ని నిలబెట్టి తరిమి నాశనంచేయడం రెడ్ ఆర్మీ, నౌకాదళం, విమానదళం—వీటి ప్రథమకర్తవ్యం. ఈపని

లో రష్యాలోని 1930 లక్షల ప్రజల పూర్ణసహాయం రెడ్ఆర్మీకివుంది. అంతేగాదు. "నాజీరాక్షసులతో మనంచేస్తూన్న జాతీయయుద్ధం, మన దేశానికి తటస్థించిన ప్రమాదాన్నెదుర్కోడానికేగాదు; యావత్తు యూరోపియన్ ప్రజలనూ నికృష్టమైన ఫాసిస్టుబానిసత్వాన్నుంచి విమోచనచేసే పవిత్రకర్తవ్యాన్నికూడా మనం నెరవేరుస్తున్నాము. ఈవిముక్తిపోరాటంలో మనం ఒంటరిగా వుండము. హిట్లరుచే బానిసలుగా చేయబడిన జర్మన్ ప్రజలతోసహా యూరోపులోని అన్నిదేశాలప్రజలు, అమెరికనులుకూడ మనపక్షాన్నేవున్నారు. మాతృదేశంకోసం మనంచేస్తూన్న యీయుద్ధంలోనే, అమెరికా, యూరోపుఖండాలప్రజల స్వాతంత్ర్యయుద్ధం, ప్రజా. పోరాటం; యిమిడివున్నాయి" అని సోవియటుప్రజలకు యిచ్చిన రేడియో వుపన్యాసంలో కామ్రేడ్ స్టాలిన్ చెప్పేడు.

రెడ్ఆర్మీ ఫాసిసులను హతమార్చినప్పుడే యూరోపుప్రజలకు స్వేచ్ఛాజీవనం లభిస్తుంది. ప్రస్తుతపు జీవన్మృతత్వాన్నుంచి జర్మన్ ప్రజలు కూడా అప్పుడే వుద్ధరించబడతారు. అంచేతనే ఆక్రమితరష్యాలోని గోరిల్లాలవలెనే అన్నియితరదేశాల్లోనూకూడా ప్రజలు, రైతుకార్మికులు, ఫాక్టరీలను, పంటలను, రైల్వేలను, గనులను, ఉత్పత్తిసాధనాలన్నిటినీ నాశనం చేస్తూ అనేకవిధాలుగా నిరోధాలు కల్పిస్తున్నారు. ఇదే ప్రజాస్వాతంత్ర్యయుద్ధమని ఋజువుచేస్తూంది.





# రెడ్ ఆర్మీ సైనికుని ప్రతిజ్ఞ

సోవియటు పౌరుడనైన నేను కార్మికకర్షకుల రెడ్ఆర్మీలో ప్రవేశించుతూ, గౌరవనీయుడుగాను, ధైర్యశాలిగాను, సుశిక్షణతోను, మెలకువతో పోరాడేవాడుగను వుండగలవాడను. మిలిటరీరహస్యాలను, ప్రభుత్వ రహస్యాలను బైట పెట్టకుండావుంటాను. మిలిటరీనియమాలను, కమేండర్ల ఆజ్ఞలను జవదాటకుండా వుంటానని ప్రతిజ్ఞచేస్తున్నాను.

నేను మిలిటరీజ్ఞానాన్ని విచక్షణాయుతంగా సంపాదిస్తాను; మిలిటరీఆస్తులను, జాతీయసంపదను అనిమేషుడనై, నిర్నిద్రతగా కాపాడుతాను, నాదేశప్రజలకు, సోవియటు మాతృభూమికి, కార్మికకర్షకప్రభుత్వానికీ నాకంఠంలో కొనఊపిరి ఉండేదాకా బాసటగా నిలబడి పోరాడుతాను.

నేను సోవియటు యూనియన్ కోసం, కార్మికకర్షకప్రభుత్వం యొక్క ఆజ్ఞలు శిరసావహించుతాను. కూలీరైతుల రెడ్ఆర్మీలో చేరిన నేను నా మాతృదేశాన్ని, ధైర్యంతో, నేర్పుతో, పరువుతో, గౌరవనీయంగా, సంరక్షిస్తాను—ఈకర్తవ్యనిర్వహణలో నారక్తం ధారపోయడానికి, ప్రాణం బలియివ్వడానికి వెనుదీయను. సోవియటుప్రజల శత్రువులను నాశనంచేయడంలో నేను వెనుకాడను.

నేను అసూయచేగాని, ప్రాణభీతిచేతగాని, యీప్రతినను భంగం చేసినట్లయితే, నామీద సోవియటుచట్టాలప్రకారం శిక్షవిధించబడుగాక ! నాప్రజలు, కార్మికకర్షకలోకం, నన్ను అసహ్యించుకొనుగాక. నా సోదరులచేతిలోనే లజ్జాకరమైన మరణం పొందుదునుగాక !